RECAP: RAM AND SHYAM RESCUE AN ALIEN - ZARTOGAARR, WHAN HIS SPACESHIP CRASHES TO EARTH. IN RETURN HE GIFTS THEM THE DEKATRIX, A POWERFUL GADGET WITH 10 POWERS. EACH POWER CAN BE UNLOCKED BY EATING THEIR FAVOURITE POPPINS. 10 POWERS: SHAPE SHIFTER-GREEN APPLE, SPEED-MANGO, FLIGHT-ORANGE, GIANT-WATERMELON, STRENGTH-RASPBERRY, SHRINK-LYCHEE, INVISIBLE-PINEAPPLE, STRETCH-MUSK MELON, FISSION-BLACK CURRANT, FORCE FIELD-GUAVA.




ఏంజిల్‌తో పాటు రామ్ మరియు శ్యామ్ స్పేస్ టూర్‌కు ఆమె కొత్త చల్లని స్పేస్‌షిప్‌లో వెళ్తున్నారు.




ఉన్నట్టుండి, వాహనంలో ఏదో తప్పు జరిగినట్టనిపించింది మరియు వారు బ్లాక్ హోల్‌లోకి నెట్టేయబడ్డారు. డెకాట్రిక్స్ రామ్ మరియు శ్యామ్ చేతులని బ్లాక్ హోల్ బయటే కట్టిపడేసింది.




కొద్ది నిమిషాల తర్వాత, వారు మరోవైపుకు వెళ్లారు, వారు ముసలి వారిలా కనబడ్డారు.




ఈ క్లిష్ట పరిస్థితి గురించి జవాబులని పొందడానికి, ఆర్-22 గలాక్సీలో ఉన్న ఏంజిల్స్ ఇంటికి వెళ్ళారు. జార్టో వారికి స్వాగతం పలికింది.







రామ్ మరియు శ్యామ్ డెకాట్రిక్స్‌ని పొందడానికి బ్లాక్ హోల్ లోపలికి మరోసారి వెళ్ళాలని నిర్ణయించుకున్నారు.




ఏంజిల్ కూడా వీరితో చేరింది




వారు బయటికి వెళ్ళే మార్గాన్ని ఎలా మార్చారంటే 20 ఏళ్ళ గతంలోకి, ఏరోజైనా బెల్లట్రిషియన్స్ భూమితో యుద్ధాన్ని ప్రకటించిన రోజుకు, త్వరగా చేరుకునేలా చేసారు.

వారి స్పేస్ షిప్ స్పేస్‌లో మళ్ళీ కనిపిస్తోంది, రామ్ మరియు శ్యామ్ ఇప్పుడు మళ్ళీ టీనేజర్లుగా మారారు. వారు 25 ఏళ్ళు ముందుకు వెళ్ళి మళ్ళీ 20 ఏళ్ళు వెనక్కి వచ్చారు. ఇది 5 ఏళ్ళ వారి అసలైన వయసుపై ప్రభావం చూపింది. మరియు ఇప్పుడు వారు దీనితో జీవించి తీరాలి.



డెకాట్రిక్స్ కూడా ఈ బ్లాక్ హోల్ ప్రభావం నుండి తప్పించుకోలేరు.








# BSA LADYBIRD

*Your best friend for life.*



BSA LADYBIRD

*Breeze*



## Ride like a wild Breeze

When there's a Breeze around, every day looks even more exciting. The dashingly designed cycle is your perfect partner for the daily getaways and weekend adventures. Ride the joy.

**Attractive Product Benefits:** Designer Step Through Frame Attractive Wire Mesh Basket | MTB Tyres | Stylish Chain Cover Designer Skirt Guard | Strong Integrated Carrier

Available in four colours



Black





Aqua Green



Steel Blue

Customer care no.


September 2012 ₹25/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar
**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju
**Sub Editor :**
Patricia Pandian
**General Manager :**
Sowmya Bharadwaj
**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar
**Artist :**
Venki
**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar
**Production In-charge :**
Prashant Pawar
**Circulation:**
circulation@chandamama.com
**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej
**Sales Officer - Circulation :**
K. Ravishankar
**Advertisement :**
sales@chandamama.com
**Customer Help :**
Ph: 022 40786043
customerhelp@chandamama.com
**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No: 19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email: chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD., Published and Printed on their behalf by Prashant Sharad Muleker Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093. Printed At :- Mothers Graphics (I) Pvt. Ltd. 91D, Govt. Ind. Estate, Charkop, Kandivali (W), Mumbai - 400067. Editor :- Prashant Sharad Mulekar

T

# ఈ సంచికలో ...

## చందమామ

Volume-3 September 2012 Issue-09


- పాఠకుల లేఖలు ...06
- భత్వారం ...07
- చందమామతో నా జ్ఞాపకాలు ...09
- సువర్ణభూమి ...11
- మర్రిచెట్టు సాక్ష్యం ...17
- నందనవనం ...20
- మిత్ర సంప్రాప్తి - 2 ...24
- అందరి బాధ్యత ...27
- మంత్రియుక్తి ...30
- మహిమ గల కావడిబద్ద ...32
- జలరాక్షసుడు ...35
- విజయ స్తూపం ...39
- వ్యత్యాసం ...43
- పారని యుక్తి ...44
- చెవుల్లేని వినాయకుడు ...48
- సాలెవాడి చాతుర్యం ...52
- నిలువ నీరు ...54
- శిథిలాలయం - 30 ...55
- వింత పన్ను ...63
- ఘంటాకర్ణుడు ...64
- ఆస్తిపంపకం ...66
- గొప్పవాడు ...67
- చిదంబర రహస్యం ...70
- కెరీర్ అంటే? ...73
- చందమామ లోకజ్ఞానం క్విజ్ - 44 ...74
- నవ్వుల పువ్వులు ...75
- మన దేశభాషలు నేర్చుకుందాం ...76
- భారత దర్శిని ...78
- బీర్బల్ ...80
- పొలకులు ...82

# విఘ్న వినాయకుడి ఆశీస్సులు...

ఈ నెలలో మనం వినాయక చతుర్థిని జరుపుకుంటున్నాము. అడ్డంకులను అధిగమించే శక్తిని ప్రజలకు అందించడానికి ప్రస్తుత ప్రపంచ పరిస్థితుల్లో ఒక దివ్య జోక్యం అవసరం అవుతోంది. ప్రస్తుత ద్రవ్యోల్బణ ఒత్తిడులకు దోబూచులాడుతున్న రుతుపవనాలు కూడా తోడై, సామాన్యుడి జీవితాన్ని దుర్భరం చేస్తున్నాయి. వానలు బాగా కురవాలని ప్రార్థించడానికే మనం పరిమితం కావద్దు. దీంతోపాటు ప్రజలు నీటిని వినియోగించడంలో కూడా జాగ్రత్తగా ఉండాలి. అప్పుడే ప్రాణాధార వనరులను వృధాపర్చకుండా ఉంటాము. అలాగే వాన నీటి సంరక్షణ పథకాలపై మదుపు చేయడం ద్వారా భవిష్యత్ అవసరాలకు సిద్ధపడగలం కూడా. దీన్నే మేము చందమామలో విస్తృతంగా బలపరుస్తూ వస్తున్నాము.

భారతదేశానికి శ్రీ ప్రణబ్ ముఖర్జీ రూపంలో ఒక కొత్త రాష్ట్రపతి లభించారు. భారతీయ ప్రజలు, రాజకీయాలు మరియు పర్యావరణం గురించి విస్తృత అవగాహన కలిగి ఉన్న విశిష్ట వ్యక్తి ప్రణబ్. నూతన రాష్ట్రపతిని చందమామ అభినందిస్తూ స్వాగతిస్తోంది.

చందమామ సంచికలో, చందమామ వెబ్‌సైట్‌లో ప్రచురించడానికి మా పాఠకులను, రచయితలను మరిన్ని కథలు పంపవలసిందిగా కోరుతున్నాము.

– సంపాదకులు



# పాఠకుల లేఖలు

చందమామ ఆర్ట్‌బుక్ రెండు సంపుటాలను తీసుకున్నందుకు గర్వపడుతున్నాను. అరవై సంవత్సరాల చందమామ సుదీర్ఘ ప్రయాణాన్ని సూచిస్తున్న అద్భుతమైన ఆర్ట్‌బుక్‌ను రూపొందించినందుకు మీకు కృతజ్ఞతలు. పిల్లలకోసం, 73 సంవత్సరాల వయసున్న నాలాంటి పెద్దలకోసం మీరు చేసిన ఈ మహా ప్రయత్నాన్ని దేశంలో మరెవ్వరూ చేయలేదు. అందరికీ అందుబాటులో ఉండడానికి మీరు ఈ పుస్తకాన్ని ఇంగ్లీషులో ప్రచురించడం మరీ బాగుంది. దేశాంతరం వెళ్లినప్పుడు కొన్ని విరామాలు తప్పితే 1956 నుంచి నేను చందమామను చదువుతూ వస్తున్నాను. ఈ వయసులోనూ నేను చందమామను చదువుతూ, చందమామ కథలను నా మనవళ్లకు చెబుతుంటాను. – ఎఆర్ శర్మ, హైదరాబాద్

మా అమ్మమ్మ తన కూతురి కోసం, ఆమె సోదరీ సోదరుల కోసం చందమామ సంచికలను కొనిపెట్టేది. ప్రతినెలా చందమామ వారి ముంగిట్లోకి వచ్చి వాలేది. దయచేసి చందమామను వార పత్రికగా ప్రచురించండి. – మహీధర్, (ఇమెయిల్ ద్వారా)

అరవైయ్యారు వసంతాల మా చందమామకు దీర్ఘాయుష్మాన్ భవ. చందమామ మళ్ళీ తన పూర్వ వైభవాన్ని సంతరించుకోటానికి చేసే యత్నం అభిలషణీయం. పాత తరం శైలిలో వస్తున్న కథలు చాలా బాగున్నాయి. 'పాపడి పద్దు పుస్తకం', 'తాతయ్య కథలు', 'భేతాళుని కథలు' మరీ మరీ చదివించే విధంగా ఉన్నాయి. 66వ జన్మదిన సంచిక ముఖచిత్రంగా తొలి చందమామ ముఖచిత్రం రావటం చాలా బాగుంది. చందమామ ఇలాగే తన విజయ ప్రస్థానాన్ని కొనసాగించాలని మనసారా అభిలషిస్తున్నా. – సాయిలక్ష్మి కోరాడ, న్యూజెర్సీ, అమెరికా

దాదాపు 25ఏళ్ళ తర్వాత చందమామను ఇటీవలే చూశాను. జూలై సంచికను, అంతకు మునుపు నెలల సంచికలను చూడగానే మరపురాని బాల్య జ్ఞాపకాలు మనసంతా ఆవరించాయి. చందమామ ఈరోజు ఒక బ్రాండ్ నేమ్‌గా ఉండవచ్చు కాని నా దృష్టిలో చందమామ భారతీయ ప్రజలకు ప్రతిరూపం వంటిది. మరోమాటలో చెప్పాలంటే చందమామ మనందరి బాల్యానికి ఐకాన్ వంటిది. – వెన్నెలకంటి రామారావు, ఆంధ్రజ్యోతి, హైదరాబాద్

66వ వార్షికోత్సవ సంచిక అద్భుతంగా ఉంది. అరవయ్యారేళ్ల నాటి ముఖచిత్రం ఇంతవరకు చూడలేదు. ఇప్పుడు చందమామలో దాన్ని చూడడం కొత్త అనుభూతి. బాలికముందు పురివిప్పిన నెమలి దృశ్యం చాలా చాలా బాగుంది. – డ్యాక్టర్ సిరి, మిర్యాలగూడ, నల్గొండ, ఎపి

జూలై చందమామకే వన్నెతెచ్చాయి 'దొంగను మార్చిన కుక్క', 'అస్తిపంపకాలు.' ఈ కథలు చదవడం పూర్తవగానే గుండె బరువెక్కింది. ఒక కథ, అచంచలమైన విశ్వాసానికి మారు పేరయిన కుక్కను ఎత్తిపడితే, మరో కథ ఎక్కడో ఒకచోట బతికే ఉన్న మానవత్వానికి 'మెచ్చు'తునకగా నిలిచింది. విలువలను వలువల్లా విడిచేస్తున్న ప్రస్తుత సమాజానికి సందేశంతో కూడిన ఇలాంటి ఆణిముత్యాలు అవసరం. – జి. జాన్ కెనడి, ఘటకేసర్, రంగారెడ్డి జిల్లా, ఎపి

# ఛత్వారం

పూర్వం ఒకప్పుడు హత్యలూ, దారిదోపిడీలూకాక, చిన్నచిన్న దొంగతనాలు చేసినవాళ్ళను, గ్రామాధికారులు, మెడలో ఒక కొయ్య గుదిబండ కట్టి ఎండలో కూర్చోబెట్టేవారు.

ఒకసారి ఎల్లయ్య అనేవాడు, గ్రామం బయట పొలిమేరలో మేస్తున్న ఎద్దునొకదాన్ని దగ్గర్లో దొరికినతాడును మెడకు కట్టి, దొంగిలించుకుపోవాలని చూశాడు. ఐతే, ఆ ప్రాంతాల కాపలా వున్నవాడొకడు అది చూసి, గ్రామాధికారికి చెప్పాడు. గ్రామాధికారి, నౌకర్లను పంపి ఎల్లయ్యను పట్టుకుని–సూర్యాస్తమయవేళ వరకూ శిక్షగా, మెడలో ఒక గుదిబండ తగిలించి, ఎర్రని ఎండలో కూర్చోబెట్టించాడు.

కొంతసేపు తర్వాత, ఎల్లయ్యఊరివాడు పుల్లయ్య అటుగాపోతూ, ఎల్లయ్యను చూసి ఆశ్చర్యంగా, ''ఏమిటిది, మెడలో గుదిబండా నువ్వా?'' అంటూ అడిగాడు.

''ఏం చెప్పేది, అంతా దురదృష్టం!'' అన్నాడు ఎల్లయ్య.

''అసలేం జరిగిందేమిటి?'' అన్నాడు పుల్లయ్య తమ ఊరివాడి పరిస్థితికి జాలి పడుతూ.

''మరేం లేదు. అలా గ్రామం దాటిపోతూంటే, ఒక పచ్చికబయల్లో పెద్ద తాడొకటి కంటబడింది, తీసుకున్నాను, అంతే!'' అన్నాడు ఎల్లయ్య.

''దారిలో కనబడిన తాడు తీసుకున్నందుకు ఇంత శిక్షా?'' అంటూ నివ్వెరపోయాడు పుల్లయ్య.

''ఆ తాడు వెనక ఎంత లేదన్నా ఐదారు వందలు చేసే ఎద్దొకటున్నది. నా ఛత్వారం పాడుగానూ, దాన్ని నేను గమనించలేదు!'' అన్నాడు ఉస్సూరుమంటూ ఎల్లయ్య.



Subscribe



# Chandamama

Because stories make the world go round...

Avail the loyalty bonus!

Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions)

Chandamama is monthly magazine available in English and 11 regional languages.
Junior Chandamama is for children above 4 years and is available only in English.

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama: (Tick whichever is applicable):

- ☐ English
- ☐ Assamese
- ☐ Bengali
- ☐ Kannada
- ☐ Hindi
- ☐ Gujarati
- ☐ Malayalam
- ☐ Marathi
- ☐ Oriya
- ☐ Sanskrit
- ☐ Tamil
- ☐ Telugu
- ☐ Junior (Only in English)

| Take Your Pick! | 1 Year | 2 Year | 3 Year | 4 Year | 5 Year |
|---|---|---|---|---|---|
| English (₹ 30/- per copy) | ₹ 360 | ₹ 645 | ₹ 915 | ₹ 1150 | ₹ 1350 |
| You Save | | ₹ 75 | ₹ 165 | ₹ 290 | ₹ 450 |
| Junior (₹ 20/- per copy) | ₹ 240 | ₹ 430 | ₹ 610 | ₹ 765 | ₹ 900 |
| You Save | | ₹ 50 | ₹ 110 | ₹ 195 | ₹ 300 |
| Regional (₹ 25/- per copy) | ₹ 300 | ₹ 540 | ₹ 765 | ₹ 960 | ₹ 1125 |
| You Save | | ₹ 60 | ₹ 135 | ₹ 260 | ₹ 375 |

**Annual Subscription Overseas:** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

Name:..........................................................................................

Address:..........................................................................................

..........................................................................................

City:.................................... State:.................................... Pin:....................................

Date of Birth:.................................... Sex:......... Telephone:.................................... Mobile:....................................

Email:.................................... Subscription Number (for renewals):....................................

Gift Subscription to the following address:..........................................................................................

..........................................................................................

..........................................................................................

Enclosed Cheque / DD* for Rupees.................................... Cheque / DD No.:....................................

favouring Chandamama India Ltd on.......................................................................... bank

*Your subscription will commence in 6 weeks.

Please mail the subscription form to: **Chandamama India Ltd.**, P. O. Box No.: 19407, Mumbai-400093.

Email: customerhelp@chandamama.com | You can also subscribe online at: www.chandamamashop.com

**Conditions apply

## చందమామతో నా జ్ఞాపకాలు - తమిళం

నాలుగో తరగతిలోనే నాకు అంబులిమామ(చందమామ)తో పరిచయం ఏర్పడింది.


Name: Narayanan
Vadapalani, Chennai.

నాకిప్పుడు 67 సంవత్సరాలు. మర్యాద రామన్న, బేతాళ కథలు, బీర్బల్, సింద్‌బాద్ వంటి ప్రముఖ సీరియల్స్ అంటే నాకు బాగా ఇష్టం. ఒకసారి మా మామయ్య మా ఇంటికి వచ్చినప్పుడు అంబులిమామను తెచ్చాడు. మొదట ఆ పుస్తకాన్ని తాను చదివిన తర్వాత నాకు ఇస్తానని చెప్పాడు. కాని మరునాడు నేను పాఠశాలల నుంచి రాగానే ఇంటికి వచ్చిన అతిథులు అంబులిమామను తీసుకుని వెళుతుండటం చూసి పెద్దగా ఏడ్చేశాను. ఆ పుస్తకం కొత్త కాపీ తీసివ్వమని మా అమ్మనాన్నలను నిగ్గదీసి అడిగాను. తర్వాత నేను కాలేజీలో చేరినప్పుడు అంబులిమామ కోసం ఒక కథనం రాసి పంపాను. 1963లోని ఒక సంచికలో 'మా ఊరు-వతిరైప్పు' అనే పేరిట ఆ కథనం చందమామలో అచ్చయింది. దానికి చందమామ యాజమాన్యం నాకు అయిదు రూపాయలు నగదు పంపించింది. ఇప్పుడు అంబులిమామ కొత్తరూపం ధరించింది కాని దాని కథల నాణ్యత తగ్గలేదు.


Rs. 5/-

Tamil: Remuneration for the article ENGAL OOR WATRAP published in July-63 Ambulimama.

For CHANDAMAMA PUBLICATIONS

ACCOUNTANT

## చందమామతో నా జ్ఞాపకాలు - హిందీ

పంజాబ్ రాష్ట్రం పాటియాలా జిల్లాలోని గాఘూ ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో 6వ తరగతి చదివేటప్పుడు మా పెద్దన్న భూపేంద్ర సింగ్ అషాట్ చందమామను స్కూలునుంచి ఇంటికి తీసుకొచ్చేవాడు. చందమామ వచ్చీ రాగానే మా నలుగురన్నదమ్ములమూ 'ముందుగా నే చదువుతా అంటే నే చదువుతానం'టూ లాక్కోవడానికి పోట్లాడుకునేవాళ్లం. చందమామలో మైమరిపించే చిత్రాలే ఇందుకు


Dr. Darshan Singh Aashat
Occ: Sr. Stenographer
Patiala (Punjab)

కారణం. ఇది 35 సంవత్సరాల నాటి మాట. చందమామను పంజాబీలో ప్రారంభించినప్పుడు మేము హిందీతో పాటు పంజాబీ చందమామను కూడా తీసుకునేవాళ్లం. కాని పంజాబీ చందమామ ఎక్కువ కాలం రాలేదు. చందమామ బాల సాహిత్యాన్ని సుసంపన్నం చేసింది. పుస్తక పఠనంపై ఆసక్తిని కలిగించడంలో, విలువలను నేర్పించడంలో చందమామ పాత్రను ఎన్నటికీ మర్చిపోలేము. పత్రిక సాగిస్తున్న ఈ సుదీర్ఘ, ఫలవంతమైన మహా ప్రయాణంలో తమ వంతు పాత్ర నిర్వహిస్తున్న చందమామ మొత్తం సిబ్బందినీ, రచయితలను, పాఠకులను మనఃపూర్వకంగా అభినందిస్తున్నాను.

## చందమామతో నా జ్ఞాపకాలు – హిందీ

నా చిన్నప్పుడు మా అమ్మ చందమామను చూపిస్తూ నన్ను నిద్రపుచ్చేది. తర్వాత పెరిగి పెద్దయ్యాక చందమామ నా చేతుల్లోకే వచ్చింది. కాని నా అసలు మామ కంటే ఈ మామ చిన్నదేమీ కాదు. మా నాన్న కూడా చందమామను దీక్షగా చదవటాన్ని నేను గమనించేవాడిని. అంత పెద్దవయసు వాళ్లను కూడా ఒక పత్రిక అంత ఆసక్తిగా చదివించడం ఏమిటని నేను మా తాతయ్యనూ, నాన్ననూ అడిగినప్పుడు, ఇతర సంచికలు మనకు కథలు మాత్రమే అందిస్తాయని, ఇప్పటి పత్రికలలో అరుదుగా మాత్రమే కనిపించే నీతి పాఠాలను చందమామ సంచిక అందిస్తుందని వాళ్లు నాకు చెప్పారు.


Kushal Chand Sahu
Chaampa (CG) - 495671

వాళ్లు చెప్పిన మాటలు నాలో ఆసక్తి కలిగించాయి ఆ మాటల్లోని నిజాన్ని నేనిప్పుడు హృదయంపు లోతుల్లోంచి అనుభూతి చెందుతుంటాను. వేసవి సెలవులలో చందమామను నాకు తోడుగా ఉంచుకునేవాడిని. నా ఊహలకు రెక్కలు తొడిగి నన్ను కూడా చందమామలో ఒక పాత్రగా మలిచేది. ఒకసారి నేను చందమామను చదువుతున్నప్పుడు, నా స్నేహితుడు చూసి 'దాన్నెందుకు అంతగా ఇష్టపడుతున్నావు? అదంటే నాకు పట్టదు' అన్నాడు. అతడికి క్రికెట్ అంటే ప్రాణం. 'నీ హృదయంతో నీవు ఏదైనా పత్రికను చదవనట్లయితే దాన్ని నీవెలా ఇష్టపడతావు' అని నేను అడిగాను. నాకయితే చందమామ అంటే ఒక సత్సంప్రదాయం. చందమామ శాశ్వతంగా వెలుగొందాలని హృదయపూర్వకంగా నేను ప్రార్థిస్తుంటాను. చందమామ నిరంతరం నూతన శిఖరాలను అధిగమించు గాక!

## బేతాళ కథలు

# సువర్ణభూమి

'పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా స్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు మాట్లాడుతూ, 'విక్రమార్కా... నీ పట్టుదల, ప్రయత్నానికి జోహార్లు. ఆరుగాలం కష్టించిన కర్షకుణ్ణి కాదని, ధర్మం మరచి తన స్నేహితుడికి వత్తాసు పలికాడొక మహారాజు. ప్రజావ్యతిరేకమైన నిర్ణయం తీసుకుని నలుగురిలో నగుబాటు పాలైన ఆ అమాయక చక్రవర్తి కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను!' అంటూ ఆ రాజు కథను బేతాళుడు చెప్పసాగాడు.

మైత్రేయపురాన్ని ఆనందసేనుడు పరిపాలిస్తున్న రోజులవి. ఆయనకు వ్యవసాయమంటే మక్కువ. తీరిక దొరికినప్పుడల్లా తన పొలాల్లోని వ్యవసాయ పనుల పరిశీలనకు వెళ్ళేవాడు. వ్యవసాయంలో తలెత్తే ప్రతి మార్పునూ గమనించి, దిగుబడి పెంచేందుకు పాటుపడేవాడు. తాను



తెలుసుకున్న విషయాలను దేశంలోని వ్యవసాయదారులందరికీ అందుబాటులో ఉంచి, వారిని ప్రోత్సహించేవాడు.

ఒక పర్యాయం.. దేశంలోని రైతులకు వ్యవసాయ ఉత్పత్తుల పోటీలు నిర్వహించ దలిచాడు ఆనందసేనుడు. పోటీల నియ మాలను, బహుమతుల వివరాలను దేశ మంతా చాటింపు వేయించాడు. సంవత్సర కాలంలో రైతులు తమతమ పొలాల్లో అధిక దిగుబడులను సాధించడమేగాక, ఆయా పంటలతో ప్రజలందరి దృష్టిని ఆకర్షిం చాలి. అలాంటి వారిలో దేశం నలు మూలల నుంచి నలుగురు ఉత్తమ రైతులను ఎంపికచేసి, వారికి సువర్ణభూమి పురస్కారాలను అందించడం, వాటితోపాటు భారీ నగదును బహుమతిగా ఇవ్వడం జరు గుతుంది.

ఆ ప్రకటన దేశమంతా ప్రచారమైంది. ఉత్సాహవంతులైన రైతులు ఆ పోటీకి సిద్ధ పడ్డారు. ఒక సంవత్సరం గడిచింది. బహు మతులు ఇచ్చేందుకు రాజు ప్రకటించిన తేదీ దగ్గరపడింది. బహుమతులు ఇవ్వాల్సిన నాడు రాజాస్థానం ప్రజలతో కిటకిటలాడింది.

రాజు చేసిన సైగతో మంత్రి మైనాకుడు పైకి లేచి, 'సభకు విచ్చేసిన అధికార, అనధి కారులకు, రైతులకు మరియు సామాన్య ప్రజానీకానికి అభినందనలు. రైతుబాంధ వునిగా పేరు గాంచిన మన మహారాజు గారి వ్యవసాయ పోటీ ఆలోచన మీలో ఎంత ఉత్సుకత కలిగించిందనేది ప్రత్యక్షంగా కనిపిస్తోంది. ఎంతోమంది రైతులు ఈ సంవత్సరకాలంలో నిద్రాహారాలు మాని, పొలాన్ని కన్నబిడ్డలా పోషించి పంటలు పండించారు. అయితే బహుమతులు అందరికీ రావనే వాస్తవాన్ని రైతుమిత్రులు గమనించాలి. దేశం నలుమూలల నుంచి నలుగురిని మాత్రమే ఎన్నుకోవడం జరిగింది. మిగిలిన కర్షకులు తమ కృషికి గుర్తింపు రాలేదని దిగులు చెందనవసరం లేదు. ఈ పోటీని ప్రతి సంవత్సరం జరపా లని ప్రభువులవారు నిర్ణయించారు. దాంతో, వారి కృషి ఏదో ఒక సంవత్సరాన గుర్తింపుకు నోచుకుంటుంది. మీరందరూ ఎంతో క్రమశిక్షణతో వ్యవహరించి, మనం ప్రారంభించిన ఈ నూతన ఒరవడిని ఇరుగుపొరుగు దేశాలు కూడా అనుసరిం చేలా విజయవంతం చేయాలి,' అంటూ రాజుకు అభివాదం చేసి తన స్థానంలో ఆసీనుడయ్యాడు.

రాజు ఆనందసేనుడు సింహాసనం నుంచి లేచి నిల్చోగానే, సభలో గుండుసూది పడినా వినబడేంత నిశ్శబ్దం

అలువుకుంది. గొంతు సవరించుకుంటూ, 'పోటీలపై ప్రతి ఒక్కరూ ఆసక్తిని చూపించడం శుభపరిణామం. వ్యవసాయవృత్తిని పలువురు చేపట్టేందుకు నేను తీసుకున్న ఈ నిర్ణయం దోహదపడుతుందని ఆశిస్తున్నాను. విజేతలు, వారి వివరాలను నేనే స్వయంగా సభలో తెలుపుతాను. ముందుగా రాజ్య నైరుతిదిశ ప్రాంతం నుంచి ఎన్నికైన ఆదర్శరైతు రామకోటి.' అంటూ చిరు దరహాసంతో చెప్పాడు.

రామకోటి వినయంగా చేతులు జోడించి సభికులకు అభివాదం చేశాడు. రాజు అతని ఘనతను తెలుపుతూ, 'రామకోటి ఈ సంవత్సరకాలం పాటు తన దృష్టినంతా కూరగాయల సాగుపై ఉంచాడు. ఎవరూ కనీవినీ ఎరుగని పరిమాణంలో కాయగూరలను పండించి, వీక్షకులు ముక్కున వేలు వేసుకునేలా చేశాడు. అతని ప్రతిభకు నిదర్శనంగా మీ ముందు రామకోటి తోటలో కాసిన ఓ భారీ గుమ్మడి కాయను ప్రదర్శించడం జరుగుతుంది' అని చెప్పి చేతితో సంజ్ఞ చేశాడు ఆనందసేనుడు. నలుగురు భటులు అతికష్టంపై ఓ గుమ్మడికాయను మోసుకొచ్చి సభలోని ఓ బల్లపై ఉంచారు. దానిని చూసిన సభికులు నోరెళ్లబెట్టారు. వందమందికి సరిపోయేలా ఉందది! సభ మధ్యలో సత్కార ఆసనం ఏర్పాటు చేయించి, దానిలో రామకోటిని కూర్చోబెట్టి 'సువర్ణభూమి' జ్ఞాపికను, నగదు సంచీని ఇచ్చి దుశ్శాలువతో సత్కరించాడు ఆనందసేనుడు. సభ కరతాళధ్వనులతో మార్మోగిపోయింది.

తరువాత ఈశాన్యప్రాంతం నుంచి ఉత్తమరైతుగా సోమశర్మ ఎన్నికకాబడ్డాడు. తనకున్న కొద్దిపాటి పొలంలోనే చీడపీడలు సోకకుండా, పలురకాల ఆకుకూరలు పండించాడు. అతని ఆకుమడిలోని ఓ పెద్ద ఆకును తెచ్చి సభ ముందు ఉంచి,





అందులో సంవత్సరం పాపాయిని పడుకోబెట్టారు. ఆ ఆకు పాపాయికంటే అధికవైశాల్యంతో ఉండి, సభికుల చప్పట్ల వర్షాన్ని కురిపించింది.

సోమశర్మ సన్మాన అనంతరం.. ఆగ్నేయ ప్రాంతం నుంచి కర్షకోత్తముడిగా మాధవకీర్తి ఎంపికయ్యాడు. 'ఇటీవల ఒక పర్యాయం కార్యార్థియై పరివారంతో రాజ్యపర్యటన చేస్తున్నప్పుడు, మాధవకీర్తి తోట పక్కనుంచి వెళ్ళడం తటస్థించింది. తోట మీదుగా మెల్లగా వీచిన గాలి, ఆ తోటలో విరగకాసిన మామిడిపళ్ళ రుచిని మోసుకొచ్చింది. ఆ సువాసన నాలో ఆకలిదప్పులను మాయంచేసి బుట్టెడు మామిడిపళ్ళు తిన్న సంతృప్తిని మిగిల్చింది. నాకొక్కరికే కాదు, పరివారానికంతా ఇదే అనుభవం! ఎంతోమంది అస్వస్థులు తోట దగ్గరకు వచ్చి ఆహ్లాదపూరిత గాలిని పీల్చి స్వస్థత పొందారని కూడా పరిశీలనలో తేలింది. ఇతని ప్రతిభకు నేనే ప్రత్యక్షసాక్షిని', ఆనందసేనుడు మాటలు ఆపగానే భటులు ఓ బుట్టెడు మామిడి పళ్ళు తెచ్చిపెట్టారు. వాటి సువాసన సభ నిండా అలుముకుంది. సభికుల కేరింతల మధ్య మాధవకీర్తి సత్కారం కూడా ఉత్సాహ పూరితంగా సాగింది.

చివరగా, వాయువ్యప్రాంతం నించి విశాఖుడు ఉత్తమ సాగుదారుడిగా ఎంపికైనట్లు ప్రకటన వెలువడింది. రాజు విశాఖుడి గొప్పతనాన్ని చెబుతూ, 'మనదేశ వాయవ్యప్రాంత పరిస్థితి మనకు సుపరిచితమే! అధిక క్షామంతో కునారిల్లుతూ, అరుదుగా మాత్రమే వర్షం పడే ఆ ప్రాంతంలో ధాన్యాన్ని సాగుచేయడం ఎంతో క్లిష్టమైన ప్రక్రియ. కానీ, దానిని సుసాధ్యం చేసి, పలురకాల ధాన్యాలను తక్కువ నీటితోనే పండించడం విశాఖుడి ప్రతిభకు గీటురాయి. నిరంతరం నీటిలో నానుతూ ఉన్నప్పుడే వరిపంట దిగుబడిని ఇస్తుంది. అలాంటి స్థితిని తారుమారు చేసి, దేశంలోకెల్లా వరిలో అధిక దిగుబడిని సాధించినందుకు ఈ యువరైతును సన్మానించడం అత్యంత సముచితమని నాభావన' అన్నాడు.

విశాఖుడు లేచి నేలకు నమస్కరించి, తరువాత సభికులకు అభివాదం చేశాడు. మరుక్షణమే సభికుల నుంచి ఓ వ్యక్తి లేచి నిల్చున్నాడు. అతని పేరు భైరవనాథుడు, భూస్వామి! తను మాట్లాడుతూ, 'రాజా.. మీరు అనుమతి ఇస్తే ఒక విషయాన్ని సభ దృష్టికి తీసుకురావాలని భావిస్తున్నాను' అని తన మాటల్ని మధ్యలో ఆపాడు. భైరవనాథుడు ఆనందసేనుడికి మిత్రుడే! దాంతో,



'భైరవా.. నీవు చెప్పాలనుకున్న విషయాన్ని నిరభ్యంతరంగా చెప్పు. సభికుల అభిప్రాయాలు తెలుసుకోవడం రాజు విధి,' అని అజ్ఞ ఇచ్చాడు ఆనందసేనుడు.

'వాయువ్యప్రాంతం నుంచి మీరు ఎంపికచేసిన విశాఖుడు సాగు చేసింది తన స్వంతపొలం కాదు. నా వద్ద నుంచి రెండేళ్ళకాలానికి కౌలుకు తీసుకున్న భూమి! భూ యజమానినైన నన్ను విస్మరించి కౌలురైతుకు సన్మానం చేయడం, సువర్ణభూమి పురస్కారమివ్వడం ఎంతవరకు సమంజసమో కాస్త తార్కికంగా ఆలోచించండి. భూసారాన్ని బట్టే పంట దిగుబడి ఆధారపడి ఉంటుంది. నా భూమి గొప్పతనం వలన విశాఖుడు దిగుబడి సాధిస్తే, ఆ ఘనత నాకు కాక అతనికి దక్కడం అధర్మం కదా' ఆవేదనగా అడిగాడు భైరవనాథుడు.

'నీ భూమిలో సారమున్నా, దానిని వెలికి తీసింది విశాఖుడే కదా! ఈ పురస్కారం తనకే దక్కాలి కదా' అంటూ ఆనందసేనుడు తన అభిప్రాయం తెలిపాడు.

'మీ నిర్ణయానికి మేము శిరసావహిస్తాం. అయితే ఈ ఎంపిక భూయజమానులందరినీ కించపరుస్తుందని నా భావన' అవమానభారంతో కూర్చున్నాడు భైరవనాథుడు.

కాసేపు దీర్ఘంగా ఆలోచించిన ఆనందసేనుడు, 'భైరవా... నీవు చెప్పిన మాటలు సమంజసంగా తోస్తున్నాయి. సువర్ణభూమి పురస్కారానికి నీవే అర్హుడవు. అయితే నగదు బహుమతి మాత్రం విశాఖుడికి అందజేయబడుతుంది. దీనికి నీకెలాంటి అభ్యంతరం ఉండదనే భావిస్తున్నాను,' అన్నాడు.

భైరవనాథుడు తన ఆసనంలోంచి పైకి లేచి, 'దీనికి నా పూర్తి అంగీకారాన్ని తెలుపుతున్నాను. విశాఖుడికి నేను కూడా యాభై వేల వరహాల స్వంతపైకాన్ని మీ నగదుతో పాటు అందిస్తాను' అని ఆనందంగా చెప్పాడు.

ఆసనంపై భైరవనాథుడికి సత్కారం జరిగింది. విశాఖుడికి మాత్రం నగదుసంచీ అందింది. అయితే విశాఖుడిలో ఏమాత్రం అవమానభారం లేదు, తనెంతో సంతోషంగా దానిని స్వీకరించాడు. సభికులలో అధికులకు విశాఖుడి పట్ల జాలి, భైరవనాథుడి పట్ల కోపం కలిగాయి.

ఇంతవరకు చెప్పిన బేతాళుడు విక్రమార్కుడిని క్రిందకు దించి, 'విక్రమార్కా... కుతర్కంతో, వక్రబుద్ధితో భైరవనాథుడు సత్కారాన్ని అందుకున్నా,

ప్రజల దృష్టిలో చులకనయ్యాడు. తెలివైన రాజు ఇంతటి అసంబద్ధ తీర్పును ఎలా ఇచ్చాడు? విశాఖుడు కూడా తనకు జరుగుతున్న అన్యాయాన్ని మౌనంగా వీక్షిస్తూ ఆత్మవంచన చేసుకున్నాడు. తన నుంచి స్వల్ప ప్రతిస్పందన కూడా లేకపోవడం వెనుక మతలబు ఏమిటి సమాధానం తెలిసీ చెప్పకపోయావో నీ తల వేయి ముక్కలవుతుంది,' అన్నాడు.

విక్రమార్కుడు దరహాసంతో, 'బేతాళా.. ఆశ్రిత పక్షపాతం కాదు. పురస్కారానికి నూటికి నూరుపాళ్ళూ విశాఖుడే అర్హుడని రాజు ఎరుగు. కానీ విశాఖుడికి ఇస్తే, భైరవనాథుడు అతనికి భవిష్యత్తులో సమస్యలు సృష్టించడం ఖాయం. భైరవనాథుడిది అహం సమస్య! తన పొలాన్ని వాడుకుని ఇతరులు గుర్తింపు పొందుతున్నారన్న బాధ అతణ్ణి దహించివేసింది. పురస్కారాన్ని అతనికి ఇచ్చేసినంత మాత్రాన తనకు పెరిగే కీర్తి లేదు, విశాఖుడికి కలిగే అవమానం లేదు. ఎందుకంటే ఇప్పటికే విశాఖుడి కీర్తి పలు ప్రాంతాలకు వ్యాపించింది. అతని ప్రతిభకు ప్రత్యేక గుర్తింపు అనవసరం. భైరవనాథుడి అహం చల్లారితే సమస్య పరిష్కారమవుతుందని ఆనందసేనుడు గ్రహించాడు. అలాగే విశాఖుడికి స్వంతభూమి అవసరాన్ని కూడా ఆయన గుర్తించాడు. అందుచేతనే సత్కారం భైరవునికి, నగదు విశాఖునికి ఇచ్చాడు. పురస్కారం తనకు అందుతుందని తెలియగానే భైరవనాథుని అహం శాంతించింది. దాని ఫలితంగానే, ఉత్సాహంగా తను కూడా విశాఖుడికి అదనపు నగదును ఇస్తానన్నాడు.

రాజు నిర్ణయంలోని అంతరార్థాన్ని విశాఖుడు గ్రహించాడు. అంతా తన మేలు కొరకే జరుగుతోందని గుర్తించబట్టే, ఏమాత్రం ప్రతిఘటన చేయక చిరునవ్వుతో నగదు స్వీకరించాడు. శాశ్వతభూమి కొరకు విశాఖుడికి పైకం లభించడం, భైరవనాథుడు సంతోషపడడం అనే రెండు సానుకూల ఫలితాలను తన తీర్పు ద్వారా సాధించడం ఆనందసేనుడి ఘనతే కదా!' వివరించాడు విక్రమార్కుడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగడం, సరైన సమాధానం లభించడంతో బేతాళుడు శవంతో సహా ఎగిరిపోయి తిరిగి చెట్టెక్కాడు.

*(కల్పితం) (ఆధారం: శాఖమూరి శ్రీనివాస్)*





# మర్రిచెట్టు సాక్ష్యం

ఒక ఊళ్లో నారాయణ శెట్టి అని ఒక ధనికుడుండేవాడు. ఆయన ఒకనాడు దూర గ్రామం పోతుండగా దారిలో కోటయ్య అనే గ్రామస్థుడు ఎదురుపడి, 'బాబూ శెట్టిగారూ, ఇల్లంతా కూలిపోయింది. తొలకరి లోపుగా బాగు చేయించుకోకపోతే నేనూ పిల్లలూ ఏ చెట్టుకిందైనా నిలబడాలి సిందే. రెండువందల రూపాయలిప్పించారా, ధాన్యం అమ్మగానే మీ బాకీ తీర్చేస్తాను,' అని ప్రాధేయపడ్డాడు.

నారాయణ శెట్టి మెత్తని మనిషి. కోటయ్య మాట తీసెయ్యలేక దగ్గిర ఉన్న సొమ్ములో నుంచి రెండు వందలు తీసి ఇచ్చాడు. కోటయ్య అనుకున్న ప్రకారం ఆ బాకీ తీర్చలేదు. ఒక పంట చెల్లిపోయింది. ఇంకో పంట కూడా వచ్చేసింది.

ఒకనాడు శెట్టి కోటయ్యతో మంచిగా, 'ఏం కోటయ్యా, ఆ బాకీ చెల్లు వెయ్యకనే పోతివి. ఏడాది వెళ్లి రెండో ఏడు కూడా జరుగుతున్నది కదా!' అన్నాడు.

'బాకీ ఏమిటి?' అన్నాడు కోటయ్య ఆశ్చర్యంగా. 'ఇల్లు బాగు చేయించుకుంటానని ఆ యేడు వేసవిలో రెండు వందలు పుచ్చుకుంటివే. జ్ఞాపకం లేనట్టు మాట్లాడతావేం?' అన్నాడు శెట్టి.

'నేనొకవేళ మరిచిపోయినా మీ దగ్గిర పత్రం ఉంటుందిగా. అది పంపించండి చాలు. తప్పకుండా చెల్లువేస్తాను,' అన్నాడు కోటయ్య, తాను పత్రం రాసి ఇవ్వనిమాట గుర్తుంచుకుని.

'అసలు నువ్వు నాకు పత్రమైనా రాయలేదే. ఇవాళో రేపో చెల్లువేస్తావు

వి. సత్యనారాయణ

గదా. ఈ భాగ్యానికి పత్రం దేనికి లెమ్మని నేను నిన్ను అడగనూ లేదు,' అన్నాడు శెట్టి గాభరాపడుతూ.

'ఇది చాలా బాగుందండోయ్‌! మీరెంత సంపన్నులైతే మాత్రం నాకు లేని బాకీలు అంట గడతారా?' అన్నాడు కోటయ్య గొంతెత్తి అఘాయిత్యంగా.

నలుగురు పోగయారు. ఏమిటంటే ఏమిటని శెట్టిని కోటయ్యనూ అడిగారు.

శెట్టి జరిగిన సంగతి జరిగినట్లుగా చెప్పాడు. అన్నీ అబద్ధాలన్నాడు కోటయ్య. 'ఇదేదో మునసబుగారు తేల్చాల్సిందే. అక్కడికే పదండి,' అన్నారు ఊళ్లోవాళ్లు.

'మునసబు గారితో నైతే మాత్రమేం? ఉన్నమాట చెప్పడానికి నాకేం భయం?' అంటూ కోటయ్య ముందు నడిచాడు.

మునసబు చాలా తెలివిగలవాడు. అవలిస్తే పేగులు లెక్క పెట్టగలడు. అయన శెట్టి చెప్పినదంతా విన్నాడు. కోటయ్య చెప్పినదీ విన్నాడు.

'నేనేం బిచ్చగాణ్ణా? రెండువందలు అప్పు చేయవలసిన కర్మ నాకేం? నా పొలంలో వచ్చే గింజలమ్ముకుని ఇల్లు బాగు చేయించుకున్న మాట నిజమే. శెట్టి గారు నిజంగా నాకు అప్పే ఇస్తే రెండేళ్లు పత్రం సాక్ష్యం లేకుండా ఊరుకుంటారా?' అన్నాడు కోటయ్య.

మునసబు శెట్టి కేసి తిరిగి, 'ఏమండీ, మీరు కోటయ్యకు డబ్బు ఎక్కడ ఇచ్చారు? డబ్బు ఇస్తుండగా ఎవరూ చూడలేదా?' అని అడిగాడు.

'అక్కడ ఎవరున్నారు బాబూ? ఒక



మఱ్ఱిచెట్టు కింద కూచుని డబ్బు తీసి ఇచ్చాను,' అన్నాడు శెట్టి.

'ఇకనేం? ఆ మఱ్ఱిచెట్టును సాక్ష్యం చేసుకుందాం. మీరు ఇప్పుడే వెళ్లి ఆ మఱ్ఱి చెట్టుతో నేను రమ్మంటున్నానని చెప్పి రండి,' అన్నాడు మునసబు శెట్టితో.

శెట్టి, 'మఱ్ఱిచెట్టు వచ్చి సాక్ష్యం చెబుతుందాండి?' అన్నాడు సంకోచంగా.

'నేను రమ్మంటే రాకేం చేస్తుంది? వెళ్లి త్వరగా చెప్పి రావయ్యా? ఆ మాట కాస్తా మఱ్ఱిచెట్టుకు చెప్పి నీ దారిన నువు వచ్చేయి. మేమంతా నీకోసం ఇక్కడే వేచి ఉంటాం!' అన్నాడు మునసబు.

అక్కడ చేరిన వారంతా మునసబు మాటలకు తెల్లబోయారు. ఇక కోటయ్య ఆనందానికి అంతే లేదు. మునసబుకు పూర్తిగా మతి పోయిందని, తన బాకీ రుజువుకావటం ఇక కల్ల అని అతను లోలోపల సంతోషించసాగాడు.

కొద్ది సేపు గడపనిచ్చి మునసబు తొందరలో ఉన్నవాడల్లే, 'ఏం కోటయ్యా? శెట్టి ఈపాటికి అక్కడికి చేరి ఉంటాడంటావా?' అని అడిగాడు.

'ఎబ్బే! అప్పుడే నాండీ? అది కోసున్నర దూరంలో ఉంది. అదీగాక వాన కురిసింది గదా. ఆ చెరువుగట్టు దారి బురద! అయినా అక్కడ ఉండే మఱ్ఱిచెట్లలో అసలు దాన్ని పోల్చడమే ఎంతో కష్టమవుతుంది' అన్నాడు కోటయ్య.

మునసబు చేతికఱ్ఱతో కోటయ్య వీపు మీద ఠపీమని 'దొంగ వెధవా! శెట్టి నీకు ఏ చెట్టు కింద డబ్బిచ్చాడో కూడా తెలుసునన్నమాట!' అన్నాడు.

మునసబు యుక్తికి అందరూ ముగ్ధులయారు. కోటయ్య బాకీ ఒప్పుకుని శెట్టికి వడ్డీతో సహా సొమ్ము చెల్లించుకున్నాడు. సొమ్ము పోగా కోటయ్యకు ఊళ్లో తల ఎత్తుకు తిరగటానికి లేకుండా పోయింది.






# నందనవనం

వేసవి సెలవులు ముగిసి ఆ రోజే పాఠశాల ప్రారంభదినం. నందిపల్లె పట్టణంలోని ప్రభుత్వ పాఠశాల విద్యార్థులంతా బడి ఆవరణలో తమ తమ వేసవి సెలవులు గడిపిన విధానం గురించి మాట్లాడుకుంటున్నారు హుషారుగా.

'ఒరే ప్రకాష్! వేసవి సెలవులు ఎలా గడిపారు? ఎక్కడి కెళ్లారురా?' అడిగాడు రవి. 'మేము ఢిల్లీ వెళ్లాంరా. అక్కడ మా పెద్దనాన్నగారుంటారు. ఎర్రకోట చూశాను. ఆగ్రా వెళ్లి తాజ్‌మహల్ చూశాము. ఈ సంవత్సరం వేసవి సెలవులు భలే సరదాగా గడిచాయిరా,' చెప్పాడు ప్రకాష్.

'రవీ, మరి నీ సంగతేంట్రా?' అడిగాడు రాము. 'మేము మా అమ్మమ్మ వాళ్ల ఊరెళ్లాంరా. అమ్మమ్మ కథలు, తాతయ్య కబుర్లు సమయమే తెలియలేదు,' అన్నాడు రవి.

అలా అందరూ ఆదిత్య, రాజేష్, శేఖర్ వారి వారి వేసవి సెలవుల విశేషాలు చెప్పుకుంటూ సరదాగా నవ్వుతూ ఉన్నారు. ప్రక్కనే నిలబడ్డ భాస్కర్ మాత్రం దిగులుగా అందరి మాటలు వింటూ ఉన్నాడు. ఏమీ మాట్లాడటం లేదు.

అది గమనించిన ఆదిత్య, 'ఏరా భాస్కర్, నువ్వలా దిగులుగా ఉన్నావేంరా? ఏమైంది నీకు? మేమంతా సరదాగా మాట్లాడుతుంటే, నువ్వు మాత్రం ఉలుకు పలుకు లేకుండా అలా ఉన్నావేంరా? మీరు వేసవి సెలవులకు ఎక్కడి కెళ్లారేంటి?' అని అడిగాడు.

'ఎక్కడికీ వెళ్లలేదురా? మేం అందరం మైసూర్, వెళ్ళడానికి సిద్ధమైనాము. తీరా బయలుదేరే రోజు చెల్లాయికి అదేదో డెంగు జ్వరమటరా, పెద్ద విష జ్వరం వచ్చింది. ఆసుపత్రిలో చేర్చాం. పాపం చెల్లాయి ఇంకా బలహీనంగానే ఉందిరా! ఈరోజు బడికి కూడా రాలేదు. ఇంకా

వై. సువర్ణకళ

కొన్నాళ్లు విశ్రాంతి కావాలన్నారు డాక్టర్లు. అవమ్మ నాన్న ఎంత కంగారు పడ్డారనుకున్నావు. తృటిలో ప్రమాధం తప్పిందన్నారట డాక్టర్లు. డబ్బు కూడా చాలా ఖర్చయిందటరా, నాన్నగారన్నారు,' అంటూ కళ్లనీళ్లు పెట్టుకున్నాడు భాస్కర్. అందరి ఉత్సాహమంతా నీరు కారినట్లయింది. భాస్కర్‌ని ఓదార్చారందరూ.

'డెంగు జ్వరమంటే దోమల వల్ల వస్తుందని మనం చదువుకున్నాము కదరా,' అన్నాడు శేఖర్.

'అవునురా దోమకాటు వల్లే డెంగు, మలేరియా, ఫైలేరియా వస్తాయి,' అందుకున్నాడు రాజేష్.

'నిజమేరా! దోమలు, ఈగలు లేని పరిశుభ్రమైన వాతావరణం కల్పించుకుంటే రోగాలు మన దగ్గరకు చేరవు. మనమంతా కలిసి మన పరిసరాలను శుచిగా శుభ్రంగా పెట్టుకోవాలిరా! ఆరోగ్యం అందరికీ అవసరం,' అన్నాడు ఆదిత్య, భాస్కర్‌ని ఊరడిస్తూ.

ఇంతలో బడిగంట మోగింది. ప్రార్థనాంతరం ఎవరి తరగతులకు వారు వెళ్లిపోయారు.

ఆ మరునాడు అప్పుడే పాఠశాల ముగిసింది. పిల్లలంతా బడి ఆవరణలో చేరారు.

'ఒరే భాస్కర్, చెల్లి ఆరోగ్యం ఎలా ఉందిరా,' ఒక్కసారిగా అడిగారందరూ.

'ఫరవాలేదురా, మెల్లిగా కోలుకుంటోంది,' చెప్పాడు భాస్కర్.

'అన్నట్లు మీకందరికీ ఓ విషయం



చెప్పాలిరా. ఈ వేసవి సెలవులు నేను మా మామయ్యతో అమెరికాలో గడిపాను. అమెరికా నుండి తిరిగి వచ్చిన రోజు నుండి అక్కడి విశేషాలు మీ అందరితో పంచుకోవాలని, బడి ఎప్పుడెప్పుడు తెరుస్తారా అని ఎదురు చూశాను తెలుసా? అన్నాడు ఆదిత్య.'

'మామయ్య అమెరికాలోని అనేక విశేషమైన ప్రదేశాలను తీసికెళ్లాడు. వాషింగ్టన్, స్వేచ్ఛాప్రతిమ, నయాగరా జలపాతం, ప్రపంచంలోనే అతిపెద్ద జలపాతం. మనం పుస్తకాల్లో చదువుకున్న విశేషాలు కళ్లముందుంటే వావ్ చాలా ఆనందంగా ఉండిందిరా,'

'నేను అక్కడ గడిపిన నెలరోజులు, ప్రతిదినం ప్రతిచోటా వారి పర్యావరణ పరిశుభ్రతనే గమనించాను,'

'అమెరికా అందాలు ఒకెత్తయితే వారి




పరిశుభ్రత మరో ఎత్తు. మన ఇల్లు ఎంత పరిశుభ్రంగా ఉంటుందో, అంతకన్నా ఎక్కువ శుభ్రంగా ఉంటాయిరా వీధులన్నీ. విశాలమైన రోడ్లలో చిన్న చెత్తముక్క కూడా కనిపించదు. ఎవ్వరూ రోడ్లమీద ఉమ్మివేయరు. రోడ్ల ప్రక్కన చెత్త పారవేయరు. రోడ్ల ప్రక్కన, ఎక్కడ పడితే అక్కడ మూత్ర విసర్జన చెయ్యరు. ప్రతి ఒక్కరూ చెత్తను జాగ్రత్తగా చెత్తవేయడం కోసం అమర్చబడిన డబ్బాలలోనే వేస్తారు' చెప్పాడు ఆదిత్య.

రవి బదులిస్తూ, 'మనం రైళ్లలో ప్రయాణిస్తున్నప్పుడు మనం తినుబండారాలు ఖాళీ చేసిన ఆకులు, కాగితాలు, వ్యర్థాలు విసిరేస్తున్నాం? కిటికీలోనుండి అలా గాలికి ఎగిరి వచ్చి తిరిగి మన ముఖానికే తగులుతాయి. చాలామంది కిటికీల్లోంచి అలా బయటికి ఉమ్మి వేస్తుంటారు. అది పక్క కిటికీ దగ్గర కూర్చున్న వాళ్ల ముఖాన్నే పడుతుంది' అన్నాడు.

'అవునురా,' అన్నారందరూ ఒకేసారి.

ఆదిత్య కొనసాగించాడు 'నేను అక్కడి రైళ్ళు, బస్సుల్లో కూడా ప్రయాణించాను. ఎక్కడా చెత్త కనిపించదురా!'

'చిన్ని నీటికుంట, సరస్సు, చెరువు ఏదైనా సరే వాటి పరిసరాలు పరిశుభ్రంగా పెట్టుకుంటారు. మనమందరం మన పరిసరాలను పరిశుభ్రంగా ఉంచుకునేందుకు ఈ రోజునుండే కాదు కాదు, ఈ పూటనుండే మన వంతు కృషి చేయాలిరా. మనం బాగా ఉండేందుకే ఇతరులతో పోల్చుకోవాలి. పాపం భాస్కర్ చెల్లిలా మన ఊరిలో మరెవ్వరూ దోమలవల్ల ఈగల వల్ల రోగాల బారిన పడకుండా మనమే జాగ్రత్త పడతాం. మనకు ఉన్నంతలో మనం, మనకి సాధ్యమయినంత కృషి చేద్దాం. కలిసి పనిచేస్తే సాధించలేనిదేముంటుంది?'

అంటూ అందరిచేతుల్లో చేతులు వేయించాడు. అలా ప్రమాణం చేసిన విద్యార్థులంతా కలిసి, వారు చేయవలసిన పనులకు ఓ ప్రణాళిక తయారు చేసుకున్నారు.

ముందుగా తమ పాఠశాల ఆవరణ, ఆ చుట్టు ప్రక్కల ప్రాంతమంతా పరిశుభ్రం చేశారు. చెత్తవేయడం కోసం అక్కడక్కడ మూతలు గల డబ్బాలని అమర్చారు. బడి పిల్లలందరికీ రోడ్లపైన ఉమ్మి వేయరాదని, మూత్ర విసర్జన చేయరాదని తెలియజేశారు.

ప్రతి సెలవు రోజున అందరూ కలిసి, జట్లు జట్లుగా విభజించబడి వారానికో

వాడ చొప్పున ఆ ఊరి ప్రజలందరికీ చెత్తను చెదారంగా కాకుండా జాగ్రత్తగా పారవేయాలని, రోడ్లపైన ఉమ్మి వేయరాదని మూత్ర విసర్జన చేయరాదని దానివలన మనం పీల్చుకునే గాలిలో రోగకారకమైన సూక్ష్మక్రిములు చేరి మనల్ని రోగాలకు గురి చేస్తాయని చెప్పారు. ప్లాస్టిక్ సంచులు వాడకూడదని దాని వలన కలిగే కష్టాలను వివరించారు.

తొలుత అందరూ వీరి మాటలకు నవ్వుకున్నారు. హేళన చేశారు. తేలికగా తీసిపారేశారు. కాని క్రమక్రమంగా ఆ చిన్నారులు ఆ ఊరి పరిశుభ్రతకై పడుతున్న తపన దాని వలన పరిసరాల్లో కలుగుతున్న మార్పు వారిలో కదలిక తెచ్చింది.

ఊరి చెరువు గట్టు చుట్టూ చేరిన చెత్త, కాగితాలు, ప్లాస్టిక్‌సంచులు వారే స్వయంగా ఏరి ఓ గొయ్యి త్రవ్వి అందులో వేసి కాల్చి పూడ్చేశారు. అనతి కాలంలోనే ఊరి చెరువు గట్టు ప్రాంతం కూడా పరిశుభ్రత సంతరించుకుంది.

బడి చుట్టూ ప్రక్కలా, ఊళ్లోని వీధుల కిరుపక్కలా, ఎక్కడ వీలయితే అక్కడ చిన్న చిన్న పూలమొక్కలు, నీడనిచ్చే చెట్లు నాటారు.

బడి ముందర గంపలో మిఠాయిలమ్ముకునే అవ్వకు ఒక గాజు డబ్బా కొనిచ్చారు. వారి స్వంత డబ్బులతో.

ఆ సంవత్సరం పాఠశాల వార్షికోత్సవం సందర్భంగా పచ్చదనం-పరిశుభ్రత పర్యావరణ పరిరక్షణ మొదలగు అంశాలతో కూడిన చిన్న నాటిక ప్రదర్శన చేశారు.

వార్షికోత్సవానికి హాజరైన కలెక్టర్ ఆ బడి పిల్లల ఐకమత్యానికి, చేస్తున్న కృషికి ఎంతో సంతోషించారు.

పాఠశాల విద్యార్థులు సాధించిన విజయానికి సంతసించి, అందుకు సహకరించిన విద్యార్థులందరికీ ప్రశంసా పత్రాలు, బహుమతులు అందజేశారు.

నందిపల్లె గ్రామాన్ని ఈ విద్యార్థులు తమ స్వయం కృషితో నందనవనంగా మార్చేసారన్నారు. ఈ పాఠశాల, ఈ గ్రామం మన రాష్ట్రానికే పరిశుభ్రతకు సంబంధించి ఓ ఉదాహరణగా నిల్చిందన్నారు.

విద్యార్థుల కృషితో ఆ పట్టణం క్రమంగా హరితవనంలా మారింది.





# పంచతంత్ర కథలు

బోయవాడు వెళ్లిపోగానే చిత్రగ్రీవం తన అనుచరులతో, 'పాపిష్టి బోయవాడు వదిలిపోయాడు. ఇక మనం నిశ్చింతగా మహిళారూప్యానికి పోదాం. ఆ నగరానికి ఉత్తర ప్రాంతంలో నాకు స్నేహితుడైన హిరణ్యకం అనే ఎలుక ఉన్నది. అది మన ఉచ్చులన్నీ కొరికేసి మనకు స్వేచ్ఛ ఇస్తుంది. ఆపదలో స్నేహితులు తోడ్పడవలసిందే గాని ఇతరులు అయ్యోపాపం అని కూడా అనరు,' అన్నది.

చిత్రగ్రీవం దారితీయగా పావురాలన్నీ హిరణ్యకం అనే ఎలుక ఉండే బిలం వద్దకు ఎగిరి వెళ్లాయి. పావురాల రాజు బిలద్వారం వద్ద నిలిచి, ఎలుగెత్తి పిలుస్తూ, 'మిత్రమా, హిరణ్యకా! త్వరగారా, నాకు గొప్ప ఆపద సంభవించింది,' అన్నది.

ఈ కేక విని, హిరణ్యకం బిలం లోపలనే ఉండి 'ఎవరు నీవు? ఇక్కడికెందుకు వచ్చావు? అంతా విశదంగా చెప్పు,' అన్నది. చిత్రగ్రీవం ఇలా అన్నది.

'నేను పావురాల రాజును. చిత్రగ్రీవాన్ని! నీ మిత్రుణ్ణి! త్వరగా రా. నాకు నీ సహాయం వెంటనే కావాలి.'

ఈ మాట విని హిరణ్యకం మిత్రుడిని చూసే ఆనందంతో బయటికి వచ్చి, తన మిత్రుడూ, అతని అనుచరులూ ఉచ్చులలో చిక్కుకుని ఉండటాన్ని చూసి దుఃఖిస్తూ, 'ఏమిటిది?' అని అడిగింది.

దానికి చిత్రగ్రీవం ఇలా అన్నది.

'ఎందుకు అడుగుతావు? గ్రహించ లేవా? పూర్వ జన్మలో చేసుకున్న దుష్కృతం కొద్దీ విధి రకరకాల పనులు చేయి

మిత్రసంప్రాప్తి – 2

స్తుంది. జిహ్వా చాపల్యం కారణంగా ఈ విపత్తు తెచ్చుకున్నాం.'

హిరణ్యకం ఇలా అన్నది.

'పక్షి నూరు మైళ్ల దూరాన ఉన్న ఆహారాన్ని చూడగలదు కాని కళ్లఎదుటనే ఉన్న వలను చూడలేదు. అయినా విధి బలీయమనే నిర్ణయానికి వచ్చాను. ఏమంటావా? మహా బలవంతులైన సూర్యుడూ, చంద్రుడూ రాహువుకు చిక్కుతున్నారు కారా? మదించిన ఏనుగులూ, క్రూర విష సర్పాలూ, గాలిలో ఎగిరే పక్షులూ మనిషికి దొరికిపోవటం లేదా? ఎక్కడ జీవించినా ప్రాణులను మృత్యువు పట్టుకుపోతూనే ఉన్నది.'

ఇలా అని హిరణ్యకం పక్షుల బంధాలను కొరకనారంభించింది.

అప్పుడు చిత్రగ్రీవం హిరణ్యకంతో 'మిత్రమా, ముందు నా ఉచ్చులు కొరకకు. నా అనుచరులను విడిపించి, తరవాత నన్ను విడిపించు,' అన్నది.

'అది అర్థం లేనిమాట. యజమాని తరవాతనే అనుచరులు,' అన్నది హిరణ్యకం. 'మిత్రమా, అలా అనకు. వీళ్లు పాపం, నాపైన ఆధారపడి ఉన్న అభాగ్యులు. తమ తమ వాళ్లను వదిలి, నా వెంట వచ్చినవాళ్లు. నేను వాళ్లపట్ల ఈ మాత్రం శ్రద్ధచూపవద్దా? రాజు ఎంత పేదవాడైనా తన సేవకుల పట్ల శ్రద్ధ చూపే వాడైతే, వాళ్లు అతడిని విడవరు. అది



అలా ఉంచి, ఇన్ని బంధాలు కొరకటంలో నీ పళ్లు విరిగిపోవచ్చు. లేదా, ఆ బోయవాడు నా అనుచరులు విముక్తి పొందే లోపుగా తిరిగి రావచ్చు. అప్పుడు నాకు నరకం సంప్రాప్తమవుతుంది. తన అనుచరులు కష్టాలలో ఉండగా, తాను సుఖాలు అనుభవించిన నాయకుడు చచ్చి నరకానికి పోతాడు,' అన్నది చిత్రగ్రీవం.

దానికి హిరణ్యకం ఇలా అన్నది.

'మిత్రమా, రాజుల విధులు నాకూ తెలుసు. నేను నిన్ను పరీక్షించడానికే అలా అన్నాను. నువు పరీక్షలో నెగ్గావు. ఇంకా అనేక వేల పావురాలకు నువు రాజు కాదగుదువు. తన కింది వాళ్లపై దయాదాక్షిణ్యాలు గల రాజు మూడు లోకాలనూ పాలించగలడు. నేను నీ

అనుచరులను బంధవిముక్తులను చేస్తాను.'

ఇలా అని హిరణ్యకం పావురాలన్నిటినీ బంధవిముక్తుల్ని చేసి, చిత్రగ్రీవంతో, 'మిత్రమా, ఇక మీరు స్వేచ్ఛగా మీ చోటికి వెళ్లిపోండి. మరొక సారి ప్రమాదం సంభవించినప్పుడు నా వద్దకు రావడానికి సంకోచించవద్దు,' అని చెప్పి, తన బిలంలోకి వెళ్లిపోయింది.

చిత్రగ్రీవం తన అనుచరులతో సహా తిరిగి వెళ్లింది.

ఇదంతా కళ్లారా చూసిన లఘుపతనకం అనే కాకి తనలో, 'ఆహా, ఈ హిరణ్యకం ఎంత మంచిది! ఈ హిరణ్యకం ఎంత మంచిది! ఎంత వివేకం గలది! నేను మాత్రం విధిని ఒంటరిగా జయించగలనా? నేను కూడా ఈ ఎలుకతో స్నేహం చేసుకుంటాను. అనంతమైన సముద్రం కూడా తన మిత్రుడైన చంద్రుడి సహాయం వల్ల గదా పైకి లేస్తుంది! అనుకున్నది.

అది హిరణ్యకం ఉండే బిలం వద్దకు వెళ్లి, చిత్రగ్రీవం గొంతుతో, 'ఏయ్, హిరణ్యకా! ఏమోయ్!' అని పిలిచింది.

ఈ కేక వినగానే, తాను చిత్రగ్రీవం బంధాలు కొరకటం మరిచిపోయానేమో నని అనుమానం తగిలి, హిరణ్యకం తన బిలం నుంచే 'ఎవరిది?' అని అడిగింది.

'నేను లఘుపతనకం అనే కాకిని,' అన్నది కాకి.

ఈ మాట వినగానే హిరణ్యకం తన బిలంలోకి మరింత దూరం వెళ్లి 'ఇక్కడి నుంచి వెంటనే వెళ్లిపో!' అన్నది.

దానికి కాకి, 'నన్నెందుకు పొమ్మంటున్నావు? నేను అతి ముఖ్యమైన పనిమీద వచ్చాను,' అన్నది.

'నీకూ, నాకూ పొత్తు క్షేమకరం కాదు,' అన్నది హిరణ్యకం.

*(ఇంకా వుంది)*





# అందరి బాధ్యత

కళింగదేశాన్ని పాలిస్తున్న వీరవర్మ హఠాత్తుగా చనిపోవడంతో అతని కుమారుడైన కుమారవర్మ పట్టాభిషిక్తుడయ్యాడు. కుమారవర్మ, ప్రతి చిన్న విషయానికీ కోపాన్ని ప్రదర్శిచడం అలవాటు చేసుకున్నాడు. అతని కోపానికి మనుషులే కాదు.. పక్షులు, జంతువులు కూడా బలైపోతుండేవి.

ఒకసారి కుమారవర్మ ఉద్యానవనంలో నుంచి రాజప్రసాదానికి తిరిగివస్తుండగా అతని కాలు పొరపాటున పాముతోకపై పడింది. ఆ పాము బుసలు కొడుతూ కుమారవర్మను కాటు వేయబోయింది. తృటిలో తప్పించుకున్నాడు. వెంట ఉన్న భటులచేత ఆ పామును చంపించాడు.

అక్కడితో ఆగక రాజ్యంలో ఉన్న పాము జాతిని నాశనం చేయమని భటులను ఆజ్ఞాపించాడు. వేల కొలది పాములని చంపి కుమారవర్మ ముందు ఉంచారు.

మరో రోజు కుమారవర్మ వేకువన హాయిగా నిద్రపోతుండగా కాకులు గోల చేయడం ప్రారంభించాయి. వెంటనే భటులను పిలిపించి రాజ్యంలో ఒక్క కాకి కూడా తిరగకుండా చర్యలు తీసుకోవల్సిందిగా ఆజ్ఞాపించాడు.

తప్పనిసరి పరిస్థితుల్లో కాకులను వేటాడి సంహరించి గుట్టలుగా పోసి కుమారవర్మకు చూపించారు. అప్పటికి కుమారవర్మ శాంతించాడు.

ఒకసారి నగర సంచారానికి బయలు దేరిన కుమారవర్మను చూసి వీధికుక్కలు మొరగడం ప్రారంభించాయి. తనను కించ పరుస్తున్నాయనే కోపంతో రాజ్యంలో ఒక కుక్క తిరగకుండా వాటిని సంహరించాలని భటులను ఆజ్ఞాపించాడు. కుక్కల వేట కూడా పూర్తయింది. కుమారవర్మ మూర్ఖత్వపు ఆలోచనలకు భయపడి పౌరులు బయటపడేవారు కాదు. వేసవికాలం ఉక్కపోత కారణంగా పౌరులందరూ ఆరుబయట నిద్రపో

బి.వి. పట్నాయక్



ఈ సంవత్సరం అనుకున్న స్థాయిలో పంట దిగుబడి రాలేదని విన్నవించుకు న్నారు రైతులు.

పరిస్థితులన్నీ వ్యతిరేకంగా ఉండటంతో పాలన గాడి తప్పింది. తిరుగుబాటు దళాలు పెట్రేగిపోయాయి. శాంతి భద్రతల సమస్య జటిలమైంది.

మంత్రివర్గ సహచరులతో సమావేశం ఏర్పాటు చేశాడు. 'మన రాజ్యానికి ఏదో అరిష్టం దాపురించింది. దానిని శాంతింప జేయడానికి క్షుద్రపూజలు ఒక్కటే శరణ్యం, మాంత్రికులను పిలిపించండి,' అంటూ ఆదేశాలు జారీ చేశాడు కుమారవర్మ.

'ప్రభూ! మాంత్రికులు వచ్చి జీవహింస చేయడం తప్ప సాధించేదేమీ ఉండదు,' ధైర్యం చేసి అన్నాడు ఒక వృద్ధ మంత్రి.

కుమారవర్మకు కోపం వచ్చింది. 'ఏమిటా అసందర్భ ప్రేలాపన?' అడిగాడు.

'పరిస్థితులన్నీ అంచనా వేశాక మాత్రమే ఈ మాటలు అన్నాను. యదార్థవాది లోక విరోధి అన్నది సత్యం కాని మీతో విరోధం పెరిగినా చెప్పవలసిన సత్యం చెప్పి తీరుతాను. నా ప్రాణం కన్నా రాజ్యశ్రేయస్సే ముఖ్యం. మీరు నన్ను ఉరి తీసినా అందుకు నేను సిద్ధం, ఉరి తీసేముందైనా నా మాటలు ప్రశాంతంగా విని నిర్ణయం తీసుకోండి.

మానవుని మేలు కోరే ప్రాణులే మూగ ప్రాణాలు. అటువంటి మూగప్రాణులను జాతికి ఒకటి కూడా మిగలకుండా నాశనం చేయించారు. వాటి శాప ఫలమే జరుగు తున్న అనర్థాలకు కారణం.

తుండేవారు. ఇది గమనించిన దొంగలముఠా ఒకటి చక్కగా దొంగతనాలకు పాల్పడుతుండేది. పౌరులు తమకు రక్షణ కల్పించవలసిందిగా కుమారవర్మకు విజ్ఞప్తి చేశారు. రక్షకభటులను నియమించి రాత్రిపూట గస్తీ కాపుకు వినియోగించాడు రాజు. వారి జీతభత్యాల భారం ఖజానాపై ఎక్కువ పడింది.

వర్షాకాలంలో రాజ్యంలో అంటురోగాలు ప్రబలడం మొదలైంది. వైద్య సదుపాయాలు కలుగుజేస్తున్నా ఫలితం లేకపోతుండేది. ఆరోగ్య వ్యయంతో ఖజానా ఖాళీ అయింది.

చలికాలం వచ్చింది. రైతులు పంటలను ఇళ్లకు చేర్చారు. కుమారవర్మ పండిన పంటలో సగభాగం ఖజానాకు చెల్లించ వలసిందని హుకుం జారీ చేశాడు.

విశ్వాసంగా మెలిగే కుక్కలు ఆ ఇంట ఈ ఇంట మిగిలిన మెతుకులు తిని రాత్రనక పగలనక కాపుగా ఉంటూండేవి. ఏదో ఊహించుకుని ఆ జాతిని నాశనం చేశారు. దొంగల పని అప్పటినుండి సులభమైంది. దొంగతనాలను అరికట్టడానికి లక్షల వరహాలు జీతభత్యాలుగా ఇస్తూ ప్రత్యేక రక్షక భటదళాన్ని ఏర్పాటు చేయవలసి వచ్చింది. ఇది ఖజానాపై అదనపు భారంగా నిలిచిన మాట నిజం.

ఇక కాకి. అది పారిశుధ్య కార్మికుల కన్నా గొప్పసేవలు అందించే పక్షి. ఆహారంలో మిగిలిన వ్యర్థ పదార్థాల నుండి కుళ్లిన కళేబరాల వరకు తిని పరిసరాలను శుభ్రంగా ఉంచే జాతిని మీకు నిద్రాభంగం కలిగిందని నాశనం చేశారు. అప్పటి నుండి పరిశుభ్రత తగ్గి లక్షలకొలది రోగక్రిములు పుట్టుకొచ్చాయి. అవే అంటువ్యాధులకు మూలకారణమయ్యాయి. వాటి నివారణకు ఖజానా ఖాళీ చేయవలసి వచ్చింది.

చివరిది పాము. దాని జాతిని నాశనం చేయడంతో ఎలుకలు కుప్పలు తెప్పలుగా పెరిగి పంటపొలాల్లో చేరి అందివచ్చిన పంటను కొల్లగొట్టాయి. చెల్లించవలసిన పన్నులు కూడా చెల్లించలేని దుస్థితిలోనికి రైతులను నెట్టివేశాయి. పాములే బతికి ఉంటే ఎలుకల్ని ఆహారంగా తీసుకుని రైతుకు సాయపడేవి. తద్వారా రైతు రాజ్యాన్ని ఆదుకునేవాడు,' అంటూ వివరించాడు వృద్ధమంత్రి.

ఇప్పుడు కుమారవర్మకు కోపం తగ్గింది. ఆలోచించడం మొదలుపెట్టాడు. అన్ని అనర్థాలకు మూలం తన కోపమేనని గుర్తించాడు. మనిషి మేలును కోరడంలో మూగప్రాణుల నిస్వార్థసేవను తెలుసుకున్నాడు. రాజ్యంలో అంతరించిపోయిన పాము, కుక్క, కాకి జాతుల పెంపకానికి ప్రాధాన్యత ఇచ్చాడు.

ఇప్పుడు రాజ్యం సుభిక్షంగా ఉంది. పర్యావరణ పరిరక్షణకు అంతరించిపోతున్న జీవాలను సంరక్షించుకునే బాధ్యత అందరిపై ఉందన్న సత్యాన్ని తెలియజేసిన వృద్ధ మంత్రికి సన్మానం చేసి కృతజ్ఞతలు చెప్పాడు కుమారవర్మ.





# మంత్రియుక్తి

కళింగరాజు కాత్యాయనుడికి కీర్తి కండూతి మెండు. ఎవరైనా తనను దర్శించవచ్చి, కొంచెం పొగిడితే చాలు... వారు కోరినది ఇచ్చి పంపేవాడు. ఒకరోజు కాత్యాయనుడు కొలువుతీరి వున్న సమయంలో సభలోనికి ప్రవేశించిన ఓ ఆగంతకుడు, 'ప్రభూ.. నేనొక విలుకాడిని. దేశదేశాల్లో నా విలువిద్యా పాండిత్యాన్ని ప్రదర్శిస్తూ తమ దర్శనార్థమై వచ్చాను. అపరదానకర్ణులుగా తమ పేరు మారుమ్రోగిపోతున్నది. అదే నిజమైతే నాదో చిన్నకోరిక,' అన్నాడు వినయంగా.

సహజంగానే పొగడ్తలకు పొంగిపోయే కాత్యాయనుడు 'నీకోరికేమిటో చెప్పు, తీరుస్తాను' అన్నాడు మురిసిపోతూ.

'మరేం లేదు ప్రభూ... ఓ దేశానికి రాజుగా ఆ రాజు అనుభవించే అధికారం.. సౌఖ్యాలు అనుభవించాలని నాకెంతో కాలంగా కోరిక. ఓ నెలరోజుల పాటు తమ సింహాసనాన్ని నాకు అప్పగిస్తే రాజు హోదాలో సకలభోగాలు అనుభవించి తరిస్తాను,' అన్నాడు విలుకాడు.

విలుకాడి కోరిక విని రాజుతో సహా సభికులంతా తెల్లబోయారు. ఇరకాటంలో పడిపోయిన కాత్యాయనుడు నిస్సహాయంగా మంత్రి సుబుద్ధి వేపు చూశాడు.

'రాజైన వాడు శక్తియుక్తులు కలిగి ఉండాలి. యుద్ధవిద్యల్లో ఆరితేరిన వాడై ఉండాలి. కనీసం నువ్వు నీ విలువిద్యలో ఎంతటివాడివో నిరూపించుకో. అప్పుడు చూద్దాం,' అన్నాడు మంత్రి.

'చిత్తం అమాత్యా. తప్పకుండా,' అన్నాడు విలుకాడు ఉత్సాహంగా. 'అంతఃపుర మైదానంలో రేపే నీకు పరీక్ష వెళ్లిరా,' అంటూ విలుకాడిని పంపించివేశాడు మంత్రి. మరునాడు

జొన్నకూటి మార్టిన్ ఫిన్‌లె

రాజు మంత్రితో పాటు సభికులు అంతఃపుర మైదానానికి తరలి వచ్చారు.

'పరీక్ష అంటే ఏమీ లేదు. వరసగా మూడుసార్లు నువ్వు మేము నిర్దేశించిన లక్ష్యాన్ని ఛేదించగలగాలి,' అన్నాడు మంత్రి. 'చిత్తం మంత్రివర్యా, నేను సిద్ధం' అన్నాడు విలుకాడు.

వంద అడుగుల దూరంలో ఓ బాలుడిని నిల్చోబెట్టి అతడి తలపై జామపండు యధావిధిగా ఉంచాడు మంత్రి. 'ఓస్. ఇంతేనా!' అంటూ విలుకాడు బాణం గురిపెట్టి బాలుడి తలపై పండును కొట్టాడు. మంత్రి మరొక బాలుడితలపై జామపండు పెట్టగా విలుకాడు ఈ సారీ గురి తప్పకుండా పండును కొట్టాడు. మూడోసారి మరొక బాలుడిని సిద్ధం చేశాడు మంత్రి.

బాణం ఎక్కుపెట్టిన విలుకాడు ఓ క్షణం ఆగాడు. ఆ తర్వాత పెదవి విరుస్తూ, 'నేను పరీక్ష నుండి విరమించుకుంటున్నాను. నాకే రాజ్యాధికారమూ వద్దు' అంటూ అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

రాజుతో పాటు అక్కడున్న వారందరూ ఆశ్చర్యంలో మునిగిపోయారు. రాజు సందిగ్ధంగా చూసాడు మంత్రికేసి.

మంత్రి చిరునవ్వు నవ్వుతూ, 'ప్రభూ.. మొదటి ఇద్దరు బాలురు విలుకాడికి ఏమీ కారు. అందువల్ల అతడు తన లక్ష్యం మీదే దృష్టిని సారించగలిగాడు. మూడవ బాలుడు స్వయాన అతడి కుమారుడు. అది గమనించిన విలుకాడి దృష్టి లక్ష్యం మీద కాక తన కొడుకు పైనే కేంద్రీకృతమైంది. గురి తప్పితే జరగబోయే పరిణామం అతడిని ఆందోళనకు గురిచేసింది. ఫలితం మీరు చూశారు కదా,' అన్నాడు.

తన సమస్యను ఎంతో తెలివిగా పరిష్కరించి ఓ పెద్ద విపత్తు నుండి రక్షించిన మంత్రి సుబుద్ధిని కాత్యాయనుడు ఘనంగా సత్కరించటమే కాక, అటుపై పొగడ్తలకు లొంగకుండా, ఉచితానుచితాలను అనుసరించి మాత్రమే ఎదుటివారి కోరికలను మన్నించడం అలవర్చుకున్నాడు.





# మహిమ గల కావడిబద్ద

హిమాలయ పర్వతాలలో మానస సరస్సు సమీపంలో ఉండే పచ్చికబయలులో ఒక గ్రామం వాళ్లు తమ ఆవులను మేపుకుంటూ ఉండేవారు. కాపరులు ఉదయమూ సాయంకాలమూ తమ ఆవులను లెక్కపెట్టుకుంటే లెక్క సరిగానే ఉండేది. కాని ఎవరైనా పని పెట్టుకుని లెక్కపెడితే ఒక ఆవు ఎక్కువ ఉన్నట్లుండేది.

ఇందుకు కారణం ఉండేది. అదేమంటే రోజూ కామధేనువు అదే బీడు మీదికి వచ్చి మిగిలిన ఆవులతో పాటు మేత మేసేది. అయితే కామధేనువు రావటం కాని, పోవటం కాని చూసిన వారు లేరు.

ఆ కారణం వల్ల ఆవులన్నీ పచ్చిక బయలులో మేసేటప్పుడు అదనంగా కనిపించే ఆవు కామధేనువని అక్కడి కాపలావాళ్లెవరికీ తెలీదు.

ఆ సమీపంలోనే ఒక గ్రామంలో ఒక ముసలివాడు ఉండేవాడు. వాడు రోజూ మధ్యాహ్నం వేళ కావడిబద్ద భుజానవేసుకుని అడవిలోకి వెళ్లేవాడు. అక్కడ ఎండు చితుకులు ఏరి, మోపులు కట్టి, మోయగలిగిన మట్టుకు కావడిబద్ద రెండు చివరలా తగిలించుకుని గ్రామానికి వచ్చి వాటిని అమ్మి సంసారం గడుపుకునేవాడు. కాని, ఆ డబ్బు వాడికి చాలీ చాలకుండా ఉండేది.

ఒకనాడు ఈ పేదవాడు అడివికేసి వెళుతుండగా దారికి అడ్డంగా ఆవులు

జి.నాగరాజు

మేత మేస్తూ కనబడ్డాయి. వాడు తన కావడి బద్దతో వాటిని అదిలిస్తూ దారి చేసుకుని ముందుకు వెళ్ళాడు. ఇలా వెళ్ళటంలో కావడిబద్దకు కామధేనువు రోమాలు తగిలి, అది పాతది కావటం వల్ల దాని పగుళ్ళలో కొద్దిగా ఇరుక్కున్నాయి.

తాను కామధేనువును అదిలించిన సంగతి కాని, దాని రోమాలు తన కావడి బద్దలో ఇరుక్కున్న సంగతి కాని వాడికి తెలియదు. వాడు మామూలు ప్రకారమే చితుకులు మోపులు కట్టి కావడి బద్దకు తగిలించి భుజానికెత్తుకుంటే కావడి అంతా కలిపి కూడా కాకి ఈక అంత బరువు లేదనిపించింది.

ముసలివాడు ఆశ్చర్యపడి మరిన్ని చితుకులు మోపులు కట్టి కావడికి రెండు వేపులా వేశాడు. అప్పటికి కావడికి కట్టిన బరువు కాకి ఈకంతే ఉన్నది!

ముసలి వాడికి ఆశ్చర్యంతో పాటు ఆనందం కూడా కలిగింది. వాడు చితుకులను తన భుజం ఎత్తు మోపులుగా కట్టి కావడి బద్దకు ముందూ వెనకా తగిలించి, సునాయాసంగా వాటిని మోసుకుంటూ గ్రామానికి వెళ్ళాడు.

చితుకులు అమ్మగా ముసలివాడికి మామూలుకు నాలుగింతలు డబ్బువచ్చింది. ఆ విధంగా వాడి ఇంటి ఖర్చులన్నీ పోగా కొంత డబ్బు మిగిలింది.

ఆ రోజు లగాయతు ముసలివాడు రోజూ ఆ కావడిబద్ద ధర్మమా అంటూ అంతులేని చితుకులను అవలీలగా



గ్రామానికి మోసుసువచ్చి, వాటిని అమ్మి సుఖంగా కాలక్షేపం చేయసాగాడు.

ఒకనాడు ముసలాడు కావడితో వస్తుండగా ఒక ధనికుడు ఎదురై, 'అబ్బో, ఇంత బరువు మోసేవాడు ఎంత బలశాలి అయి ఉంటాడో!' అనుకున్నాడు. తీరా దగ్గిరగా చూస్తే కావడి మోసేవాడు ముసలివాడు.

'ఏం, ముసలి? ఈ ఈడుకు ఇంత బరువు మోస్తున్నావు!' అన్నాడు ధనికుడు.

'నాదేముంది, బాబయ్యా. నేనిందులో నాలుగోవంతు మొయ్యగలుగుదునా! ఆ మహిమంతా కావడిబద్దది!' అన్నాడు ముసలివాడు.

ధనికుడు నమ్మలేదు. తాను స్వయంగా కావడి ఎత్తి చూశాడు. ఒక్కవేలుతో ఎత్తితే చాలు కావడి సునాయాసంగా పైకి లేస్తున్నది. 'ముసలాడా! మాకు నీళ్లు మోసేవాడు చస్తున్నాడు. ఈ కావడి బద్ద అమ్ముతావా? మూడువందల మాడలిస్తాను,' అన్నాడు ధనికుడు.

ముసలివాడు మొదట ఇవ్వనన్నాడు గాని తరవాత సరేనన్నాడు. ఎందుకంటే మూడు వందలతో తాను బతికున్నన్నాళ్లూ కడుపులో చల్ల కదలకుండా జీవించవచ్చు. తరవాత వాడు ఊళ్లో చితుకులు అమ్మి, కావడిబద్ద ధనికుడి కిచ్చి డబ్బు పుచ్చుకున్నాడు.

ధనికుడు ఆ కావడిబద్దను ఇంటికి తీసుకుపోతూ పరీక్షగా చూస్తే అది చాలా పాతదిగా కనిపించింది. అక్కడక్కడా పేడు రేగి ఉన్నది. అందుచేత ఆయన దారిలో వడ్రంగి చేత సన్నగా చిత్రిక పట్టించి ఇంటికి తీసుకుపోయాడు.

కాని వడ్రంగి చిత్రిక తగులుతూనే కామధేనువు రోమాలు పోయి అది మామూలు కావడిబద్ద అయిపోయింది.





# జలరాక్షసుడు

ఒకానొక దూరదేశంలో ఒక సరస్సుకు సమీపంలో ఒక కుటీరంలో ఒక పేదకాపు ఉండేవాడు. ఆ కాపుకు ముగ్గురు కొడుకులు. తల్లీ తండ్రీ పోయినాక పెద్దవాళ్లిద్దరూ ఏకమై ఉన్న కొద్దిపాటి ఆస్తినీ ఒడుచుకున్నారు.

'ఈ ఇల్లు నాది!' అన్నాడు పెద్దవాడు.

'ఇంట్లో సామానంతా నాది!' అన్నాడు రెండోవాడు. 'మరి నామాట ఏమిటి?' అన్నాడు మూడోవాడు.

'నీకా? ఇల్లూ, ఇంట్లో సామానూ పోగా, ఏముంటే అది నీదే. వెతికి తీసుకో,' అన్నారు అన్నలు.

మూడోవాడు ఇల్లంతా వెతికి ఒక మూల పడి ఉన్న తాటి చుట్ట సంపాదించాడు. దాన్ని వాడు తీసుకోవచ్చునని అన్నలు అనుమతించారు. ఆ తాడు భుజాన వేసుకుని కాపు కొడుకు సరస్సు తీరానికి వెళ్లాడు. వాడక్కడ నీటి ఒడ్డునే పెరిగే ఒక చెట్టు నానుకుని కూచుని తనకు బతుకుతెరువు ఏమిటా అని [illegible]స్తుండగా అంత దూరాన ఒక ఉడత కనిపించింది.

తన వద్ద ఉన్న తాడుతో ఉచ్చులు పన్ని రకరకాల జంతువులను పట్టుకుని, వాటి చర్మాలు అమ్మి బతకవచ్చునని వాడికి తోచింది. వాడు వెంటనే ఉచ్చు పన్ని ఉడతను పట్టుకున్నాడు. అయితే [illegible]గా పట్టుకున్నాక వాడికి దానిని చంప బుద్ధి కాలేదు. అందుచేత ఒక చెక్కల గూడు చేసి వాడు ఉడతను అందులో పెట్టాడు.

అలాగే వాడు ఒక కుందేలును

వి. వెంకటదాసు



కూడా ఉచ్చుల సహాయంతో పట్టుకుని దాన్ని కూడా చెక్కల గూడులో పెట్టేశాడు.

వాడు ఆ సరస్సు ఒడ్డునే మకాం పెట్టి తన తాడుకు చిన్న ఉచ్చులూ, పెద్ద ఉచ్చులూ అమర్చసాగాడు. వాడు చూస్తూ ఉండగానే ఒక పెద్ద ఎలుగుబంటి వాడికి కొంచెం దూరంగా ఉన్న గుహలో ప్రవేశించింది.

కాపు కొడుకు అలా ఉచ్చులు అమర్చుతూ ఉండగా నీటిలోపల గలగల శబ్దం వినిపించింది. వాడు తల ఎత్తి చూసేసరికి నీటిలో నుంచి సగం పైకి వచ్చిన ఒక కుర్రవాడు ఒక రాయి పట్టుకుని దానిమీదుగా తనకేసి చూస్తుండటం కనిపించింది.

ఆ సరస్సు అడుగున ఒక జలరాక్షసుడుంటున్నాడు. వాడెప్పుడూ నీరు విడిచి బయటకు రాడు. కాని ఎవరైనా సరస్సు సమీపానికి వస్తే తన మాయోపాయాల చేత వారిని నీటిలోకి వచ్చేలాగు చేసి లోపలికి ఈడ్చేశాడు. వాడు ఎందరో ప్రయాణీకులను ఈ విధంగా చంపేసి, అంతులేని బంగారం చేర్చిపెట్టాడని చెప్పుకునేవారు.

ఇప్పుడు తనను చూస్తున్నది ఆ జల రాక్షసుడి కొడుకై ఉండాలని కాపు కొడుకు గ్రహించాడు.

'మా సరస్సు దగ్గిర చేరి ఏంచేస్తున్నావు?' అని రాక్షసుడి కొడుకు అడిగాడు.

'ఈ సరస్సుకు ఉచ్చువేసి బిగలాగబోతున్నాను. అప్పుడు సరస్సు కాస్తా మూసుకుపోతుంది,' అన్నాడు కాపు కొడుకు.

రాక్షసుడి కొడుకు బుడుంగున మునిగి తండ్రి దగ్గరికి పోయి కాపు కొడుకు అన్న మాటలు చెప్పాడు.

'అంత చేస్తాడుగా? వాణ్ణి బతికి ఉండనివ్వరాదు. నువు మళ్లీ పైకి వెళ్లి నీతోపాటు చెట్టు ఎక్కమని పందెం వెయ్యి. చెట్టెక్కి అలిసిపోయినాక వాణ్ణి నీటిలోకి తోసెయ్యి. మిగతా పని నేను చూస్తాను,' అన్నాడు రాక్షసుడు తన కొడుకుతో.

రాక్షసుడి కొడుకు పైకి వచ్చి కాపు కొడుకుతో, 'నాతోపాటు చెట్టెక్కు

చూస్తాం!' అన్నాడు.

'నేను పనిమీద ఉన్నాను, కళ్లు కనబడటం లేదూ? కావలిస్తే నా చిట్టి తమ్ముడితో వెయ్యి పందెం,' అంటూ కాపు కొడుకు చెక్కల గూడులో నుంచి ఉడతను వదిలాడు.

రాక్షసుడి కొడుకు చెట్టుమీద చెయ్యి వెయ్యక ముందే ఉడుత తుర్రున చిటారు కొమ్మకు పాకిపోయింది.

రాక్షసుడి కొడుకు మళ్లీ తండ్రి దగ్గిరికి పోయి ఇలా జరిగిందని చెప్పాడు.

'అయితే వాణ్ణి నీతో పరుగు పందానికి రమ్మను. వాణ్ణి పరుగు పందానికి రమ్మను. వాణ్ణి సరస్సు చుట్టూ పరిగెత్తించి అలుపు రాగానే లోపలికి తోసెయ్యి,' అన్నాడు రాక్షసుడు.

రాక్షసుడి కొడుకు మళ్లీ పైకి వచ్చి, 'పోనీ నాతో పరుగు పందెం వెయ్యి!' అన్నాడు.

'కళ్లు లేవూ? పనిమీద ఉన్నాను. కావలిస్తే నా బుల్లి తమ్ముడితో వెయ్యి పందెం!' అంటూ కాపు కొడుకు కుందేలును వదిలాడు.

వదిలిందే ఆలస్యంగా అది వాయు వేగంతో బయలుదేరి క్షణంలో మటుమాయమయింది.

రాక్షసుడి కొడుకు మళ్లీ తండ్రి దగ్గిరికి పోయి జరిగింది చెప్పాడు.



'అలాగా! ఇదేదో మహాచిత్రంగా ఉందే! అయితే ఈసారి వాడితో మల్లయుద్ధం చేసి చితకగొట్టి నీటిలోకి తొయ్యి!' అన్నాడు రాక్షసుడు.

వాడి కొడుకు పైకి వచ్చి కాపు కొడుకుతో, 'నాతో మల్లయుద్ధం చేస్తావా?' అని అడిగాడు.

'చేతిలో పని ఇంకా పూర్తి కాలేదు. ఆ కనిపించే గుహలో మా తాత ఉన్నాడు. ఆయనతో మల్లయుద్ధం చెయ్యి. నువు గెలిస్తే అప్పుడు నీ సంగతి నేను చూస్తాను,' అన్నాడు కాపు కొడుకు.

రాక్షసుడి కొడుకు ఎలుగుబంటి ఉండే గుహలోకి వెళ్లి దాన్ని కవ్వించాడు. ఎలుగు బంటి వాణ్ణి పట్టి పీకి రక్కి వదిలిపెట్టింది. వాడు ఎలాగో చావు తప్పించుకుని అక్కడినుంచి

పారిపోయి తండ్రిని చేరుకుని జరిగినదంతా చెప్పాడు.

జల రాక్షసుడికి భయం పట్టుకున్నది. 'వీడెవడో మహా ఉద్దండుడల్లే ఉన్నాడే! వీడి తమ్ములు చెట్లెక్కటంలోనూ, పరిగెత్తటంలోనూ నిన్ను మించిన వాళ్ళంటివి! వీడి తాత నిన్ను దాదాపుగా చంపినంత పని చేశాడాయె! నిజంగానే వీడు మన సరస్సును ఉచ్చువేసి నిజంగానే మూస్తాడేమో! ఎంత బంగారం ఇస్తే వీడు మన సరస్సును వదిలిపోతాడో పోయి అడిగిరా!' అన్నాడు రాక్షసుడు కొడుకుతో.

వాడు వెళ్ళి కాపు కొడుకును అడిగాడు.

'నువు బంగారు తీసుకురా! చూసి చెబుతాను,' అన్నాడు కాపుకొడుకు.

రాక్షసుడి కొడుకు కొంత బంగారం తెచ్చాడు. అది చాలదన్నాడు కాపు కొడుకు. వాడు వెళ్ళి మరికొంత తెచ్చాడు. కాపు కొడుకు తృప్తిపడలేదు. రాక్షసుడు ప్రాణం విసిగి తన దగ్గిర ఉన్నదంతా పంపేశాడు.

'ఇంతకంటే మా దగ్గిర చిన్న వీసమెత్తు కూడా బంగారం లేదు!' అని రాక్షసుడి కొడుకు చెప్పిన మీదట కాపు కొడుకు ఆ బంగారమంతా తీసుకుని తన తండ్రి ఇంటికి వెళ్ళాడు.

'ఎక్కడిదిరా నీకింత బంగారం?' అని అన్నలు ఆశ్చర్యంగా అడిగారు.

'ఈ తాడుతో సంపాదించుకున్నాను,' అన్నాడు తమ్ముడు.

'ఈ ఇల్లూ, ఇంట్లో సామానూ తీసుకుని మాకు ఆ తాడు ఇచ్చెయ్యి,' అని అన్నలు తమ్ముణ్ణి బతిమాలారు.

తమ్ముడు ఇచ్చేశాడు. వాడు తన తండ్రి ఇల్లు బాగు చేయించుకుని, తన బంగారంతో పొలాలూ, గొడ్డూ గోదా ఏర్పాటు చేసుకుని సుఖంగా ఉన్నాడు.

వాడి అన్నలు ఆ తాడు తీసుకుని ఎటుగా వెళ్ళారో ఏమైపోయారో ఈనాటికి ఎవరికీ తెలియదు.





# విజయ స్తూపం

ఉజ్జయిని, అవంతి రెండూ ఇరుగు పొరుగు రాజ్యాలు. ఇరు రాజ్యాల మధ్య తరతరాల నుంచి శత్రుత్వం ఉంది.

అవంతి రాజు మౌనముద్రుడు వృద్ధాప్యంతో మరణించడంతో, అతని కుమారుడైన అభిషిక్తుడు రాజయ్యాడు. అభిషిక్తుడు ధర్మ నిరతుడు, ఉజ్జయినితో ఉన్న శత్రుత్వానికి చరమ గీతం పాడదలిచాడు.

అతడు ఒక రాయబారి ద్వారా తన మనోగతం తెలియబరుస్తూ, ఉజ్జయిని రాజయిన జయ సింహుడికి ఒక సందేశం పంపాడు. అందులో 'నేను మీ స్నేహం కోరుతున్నాను. మన రాజ్యాల మధ్యనున్న శత్రుత్వం మరిచిపోదాము. మన స్నేహంతో ఇరు రాజ్యాల అభివృద్ధికి కృషి సలుపుదాము' అన్నది రాయబార సారాంశము.

అయితే జయసింహుడు అందుకు సమ్మతించక 'శత్రుత్వం నువ్వు మరచినా, నేను మరిచేది లేదు. నీపై దాడి చేసి నీ రాజ్యాన్ని వశపరుచుకుని పగ తీర్చుకుంటాను,' అని ప్రతి సందేశం పంపాడు.

అంతటితో అభిషిక్తుడికి, జయసింహుని మనసు అవగతమైంది. అతను మౌనం దాల్చాడు. అయితే జయసింహుడు మాత్రం నిజంగానే, అవంతి రాజ్యాన్ని ఆక్రమించడానికి చాప క్రింద నీరులా ప్రయత్నాలు ఆరంభించాడు.

జయసింహుడి ప్రయత్నాలు చారుల ద్వారా అభిషిక్తుడికి తెలుస్తూనే ఉన్నాయి. ప్రజా సంక్షేమం మరిచి నిధులను యుద్ధానికి కేటాయించడం అభిషిక్తుడికి నచ్చలేదు. అందుకే అతనా ప్రయత్నాలు చేయలేదు. నిజంగానే జయసింహుడు యుద్ధానికి తలపడినప్పుడు శాంతి సందేశంతో అతన్ని ప్రసన్నం చేసుకోవచ్చునని

ఎన్. శివనాగేశ్వర రావు



భావించాడు.

అలా కొంతకాలం గడిచింది. అంతలో అనుకోకుండా అవంతి సర్వసేనాధిపతి అస్వస్థతకు గురయ్యాడు. అది తెలిసిన జయసింహుడు, అవంతి మీద దాడి చేయడానికి అదే తగిన సమయంగా భావించి సైన్యాన్ని యుద్ధోన్ముఖులను గావించాడు.

అప్పుడు అభిషిక్తుడు 'జయసింహా! యుద్ధం వలన అనవసర రక్తపాతం జరుగుతుంది. ప్రజల జీవితాలు అస్తవ్యస్తం అవుతాయి. అందరికీ మనశ్శాంతి కరువవుతుంది. యుద్ధం మాని శాంతి బాట పట్టు' అని శాంతి సందేశం పంపాడు.

జయసింహుడు, అభిషిక్తుని శాంతి సందేశం పెడచెవిన పెట్టి యుద్ధానికి సంసిద్ధుడయ్యాడు.

తప్పనిసరి పరిస్థితుల్లో అభిషిక్తుడు, తన సైన్యంతో వెళ్ళి యుద్ధ భూమిలో జయసింహుని ఎదుర్కొన్నాడు. తమ రాజు మీద ఉన్న అభిమానంతో అవంతి సైనికులు సర్వ శక్తులు ఒడ్డి పోరాడారు. అయితే జయ సింహుని సైనిక బలం అపారం, అవంతి సైన్యం నిలబడలేకపోయింది. విజయ లక్ష్మి జయసింహుని వరించింది.

జయసింహుడు, అభిషిక్తుని బంధించి అవంతి రాజ్యాన్ని ఆక్రమించాడు. అందుకు అవంతి ప్రజలు ఎంతో దుఃఖించారు.

జయసింహుడు యుద్ధంలో తన విజయానికి ప్రతీకగా అవంతి రాజ్యం నడిబొడ్డున ఒక విజయ స్తూపం నిర్మించాలని భావించాడు. అందుకు ఒక ప్రముఖ శిల్పిని పిలిపించి విజయ స్తూపం నమూనాను తయారు చేయించాడు.

విజయస్తూపం నిర్మాణానికి కూలీలను రప్పించి పని ప్రారంభించమని అతను అధికారులను ఆదేశించాడు. అందుకు నెల రోజుల గడువు ఇచ్చాడు.

కూలీలు వచ్చి విజయస్తూపం పని ఆరంభించారు. అయితే పని చాలా మందకొండిగా జరగసాగింది. అధికారులు, జయ సింహుని కలిసి 'మహారాజా! విజయ స్తూపం నిర్మాణం నెలరోజుల్లో పూర్తి కాదు. ఎందుకంటే కూలీలు ఉత్సాహంగా పని చేయడం లేదు,' అని మనవి చేసారు. అందుకు జయసింహుడు 'వాళ్ళ కూలీ రెట్టింపు చేయండి. అప్పుడు వాళ్ళు తప్పక ఉత్సాహంగా పని చేస్తారు,' అని



చెప్పాడు.

వారం రోజుల తరువాత అధికారులు, జయసింహుని కలిసారు. 'విజయ స్తూపం నిర్మాణం పూర్తి కావచ్చిందా? కూలీలు రెట్టింపు ఉత్సాహంతో పని చేస్తున్నారా?' అని ప్రశ్నించాడు.

అందుకు అధికారులు 'రాజా! కూలీ రెట్టింపు చేసినా కూలీలు నిరుత్సాహంగా, మందకొండిగానే పని చేస్తున్నారు. కొరడా ఝుళిపించినా వాళ్ళ తీరు మారడం లేదు' అని విన్నవించుకున్నారు.

అది విన్న జయ సింహుడు ఆగ్రహోదగ్రుడయ్యాడు. అతడు కూలీల నాయకుడ్ని తన దగ్గరకు తెమ్మని ఆదేశించాడు. కూలీల నాయకుడైన కొండయ్య దొర జయసింహుని ముందు హాజరయ్యాడు. 'మీకు రెట్టింపు కూలీ ఇస్తున్నా పనిలో ఎందుకు జాప్యం జరుగుతున్నది?' అని నిలదీసాడు జయసింహుడు.

అందుకు కొండయ్య దొర 'మహారాజా! మా రాజైన అభిషిక్తుని మేమంతా ఎంతో అభిమానించేవారం. ఎంతో మంచివాడైన మా రాజును మీరు బంధించడం, ఈ రాజ్యాన్ని ఆక్రమించడం మమ్మల్ని ఎంతో బాధించింది. అందుకే విజయస్తూప నిర్మాణంలో మనస్ఫూర్తిగా పాలు పంచుకోలేక పోతున్నాం. అందుకే జాప్యం జరుగుతున్నది' అని వివరించాడు.

కొండయ్య దొర సమాధానం విన్న జయ సింహుడు మండిపడి 'మరో వారం రోజుల్లో విజయ స్తూపం నిర్మాణం పూర్తి కాకుంటే మీ కూలీల నందరినీ ఉరి తీయిస్తాను' అని పంపి వేసాడు.

మరో పది రోజులు గడిచినా విజయ స్తూపం నిర్మాణం పూర్తి కాలేదు. అది తెలిసి జయసింహుడు కోపోద్రిక్తుడయ్యాడు. కొండయ్య దొరకు కబురు పంపబోతుండగా, కొండయ్య దొరే తన దగ్గర పని చేసే వందలాది మంది కూలీలతో జయసింహుని వద్దకు వచ్చి 'మహారాజా! మీరు చెప్పినట్లు వారం రోజుల్లో విజయ స్తూప నిర్మాణం పూర్తిచేయలేకపోయాం. అందుకు ప్రతిగా మీరు విధిస్తానన్న ఉరి శిక్షకు మేము సిద్ధంగా ఉన్నాం' అని మనవి చేసాడు.

అతని మాటలు విన్న జయసింహుడు ఆశ్చర్యపోతూ 'మీకు ప్రాణాల మీద తీపి లేదా?' అని ప్రశ్నించాడు. దానికి కొండయ్య దొరతో పాటు మిగిలిన కూలీలు 'రాజా! మా రాజు లేని ఈ

రాజ్యంలో బ్రతకడం కంటే చావడమే నయమని మేం నిర్ణయించుకున్నాం' అని ముక్త కంఠంతో చెప్పారు.

అభిషిక్తుని మీద వారికున్న అభిమానానికి అబ్బురపడిన జయసింహుడు 'మీ రాజు మీద మీకెందుకంత అభిమానం?' అని ప్రశ్నించాడు.

అందుకు వారు 'రాజా!ఒక పర్యాయం ఈ రాజ్యానికి కరువు వచ్చింది.అప్పుడు మారాజు మాతోపాటే పస్తులున్నాడు గాని పరమాన్నం తినలేదు. అటువంటి రాజు కోసం మేం ఉరిశిక్షకు సిద్ధపడడం సాధారణమైన విషయం' అన్నారు.

వారి మాటలు విన్న జయసింహుడు 'మీ అభిమానాన్ని ఇంతగా పొందిన అభిషిక్తుడు నిజంగా అదృష్టవంతుడు. అటువంటి ఉత్తముడ్ని బంధించినందుకు చింతిస్తున్నాను. అతడిని విడుదల చేయడమే కాదు.. ఈ రాజ్యాన్ని కూడా అతనికే అప్పగిస్తున్నాను,' అన్నాడు. అతని మాటలకు అవంతి ప్రజలు హర్షధ్వానాలు చేసారు.

అన్న మాట ప్రకారం జయసింహుడు అవంతి రాజ్యాన్ని, అభిషిక్తుడికి అప్పగించి తన రాజ్యం చేరాడు.

ఆ తరువాత పక్షం రోజులకు జయసింహుడికి, అభిషిక్తుడి నుంచి ఒక వర్తమానం అందింది. అందులో 'మిత్రమా! నీవు నిర్మించ తల పెట్టిన విజయ స్తూపాన్ని మా ప్రజలు పక్షం రోజుల్లో నిర్మించి నీ పట్ల వారికున్న అభిమానాన్ని చాటుకున్నారు. విజయ స్తూపం ఆవిష్కరణకు నిన్ను ఆహ్వానిస్తున్నాను' అన్నది సారాంశం.

జయసింహుడు తన అనుచర గణంతో అవంతి రాజ్యానికి వెళ్ళి, విజయ స్తూపాన్ని ఆవిష్కరిస్తూ 'ప్రజలారా! ఈ విజయ స్తూపం నా విజయానికి ఎంత మాత్రం ప్రతీక కాదు. మీ రాజు, మీ రాజ్య వాసులు, మీ మంచితనంతో నా హృదయాన్ని గెలిచి సాధించిన విజయానికి ప్రతీక' అని చెప్పాడు.

అవంతి వాసులు కరతాళ ధ్వనులతో జయసింహుడికి బ్రహ్మరథం పట్టారు.



# వ్యత్యాసం

ఒకప్పుడు ఇద్దరు రాజుల మధ్య కలహం వచ్చింది. రెండు రాజ్యాల మధ్య సరి హద్దు సమస్య ఉండటంతో పరిస్థితి విషమించి యుద్ధం ముంచుకొచ్చింది. వారిద్దరిలో బలవంతుడైన రాజు శూరసేనుడు యుద్ధంలో గెలుపొందాడు.

ఓడిపోయిన రాజు కౌండిన్యుడు అడవుల పాలై తన పరాజయానికి బదులు తీర్చుకోవడానికి అదనుకోసం వేచి ఉండసాగాడు. విజయగర్వంతో మదించిన శూరసేనుడు తన శత్రువు కౌండిన్యుడి తల నరికి తెచ్చినవాడికి లక్ష వరహాలు బహుమానంగా ఇస్తానని ప్రకటించాడు.

ఈ వార్త వింటూనే కౌండిన్య రాజు వార్తాహరుడితో తన సందేశం రాసి పంపాడు.

'శూరసేనా! నీవు నా తలపై లక్ష వరహాలు వెల కట్టి ప్రకటించావు. దానిని నేను గర్విస్తున్నాను. ఆ విలువకు నేను తగినవాడినే. కాని నీ ప్రాణానికి నేను గడ్డి పోచంత విలువ ఇవ్వను. నీ తల నరికి తెచ్చిన వాడికి నానుంచి ఒక్క దమ్మిడీ కూడా ముట్టదు.'

ఈ జవాబు చూసి శూరసేనుడు నిర్ఘాంతపోయాడు.





# పొరని యుక్తి

ఒక ఊళ్లో ఒక ధనికుడుండేవాడు. ధనవంతుడైనందుకు ఆయన దానధర్మాలు విరివిగా చేసి, గొప్ప దాత అన్న కీర్తి సంపాదించుకున్నాడు.

పొరుగూళ్లో ఇంకొక ధనికుడుండేవాడు. అయితే ఆయన పరమలోభి. కాకికి కూడా ఎంగిలి చెయ్యి విదిలించేవాడు కాడు. అందుచేత దాతను మెచ్చుకున్న నోటితోనే జనం లోభిని పడతిట్టేవారు.

తనకు వచ్చిన ఈ అపఖ్యాతిని ఎలాగైనా పోగొట్టుకోవాలని లోభికి తోచింది. ఆయన వద్ద విశ్వాస పాత్రుడైన ఒక నౌకరు ఉన్నాడు. ఆయన వాడితో సంప్రతించి, ఏదైనా ఉపాయం ఆలోచించమన్నాడు.

'మీరు గొప్ప దాత అని లోకం చేత అనిపించడం సాధ్యం కాదు. కాని దాతగా పేరు తెచ్చుకున్న పొరుగూరి పెద్దమనిషిని సులువుగా మోసగించవచ్చు. ఆయనను ఒకనాడు మన ఇంటికి అతిథిగా పిలవండి. ఆయన మన ఇంట్లో ఉన్న సమయంలో నేను రకరకాల వేషాలు వేసుకుని అడుక్కోవటానికి వస్తాను. ఆయన చూస్తూ ఉండగా నాకు ప్రతిసారీ నూరేసి వరహాలు దానం ఇవ్వండి. ఆ దెబ్బతో ఆయన నిర్ఘాంత పోయి కనిపించిన వారికందరికీ మీ దాతృత్వం గురించి చెబుతాడు. కాని ఖర్చు కాకుండా మీకు కూడా బోలెడంత కీర్తి వచ్చేస్తుంది,' అని నౌకరు లోభికి సలహా చెప్పాడు.

'నీ ఆలోచన భేషుగ్గా ఉంది. రేపే ఆయనను భోజనానికి రమ్మందాం. ఈ సాయంకాలం నువు వారి గ్రామం వెళ్లి

ఎం. రంగారావు

ఎలా చెప్పాలో అలా చెప్పి, రేపు ఉదయమే మన ఇంటికి రమ్మను,' అన్నాడు లోభి.

నౌకరు దాత ఉండే గ్రామానికి వెళ్లి ఆయనతో, 'అయ్యా, మా యజమాని గారు రేపు ఉదయానికల్లా తమరిని అతిథిగా వచ్చెయ్యమన్నారు,' అని విన్నవించుకున్నాడు.

'మీ యజమాని పిల్లికి బిచ్చం పెట్టడని ప్రతీతి గదా, నన్ను రేపు అతిథిగా పిలవటంలో ఆయన ఉద్దేశం ఏమిటి? ఏమిటి విశేషం?' అని దాత లోభియొక్క నౌకరును అడిగాడు.

'అయ్యా, మా యజమానిని గురించి అందరూ అనుకునే మాటలను మీరు నమ్మినట్లున్నారు. అసలు సంగతి చెబుతాను వినండి. ఆయన చాలా గొప్ప దాత. మామూలు బిచ్చగాళ్లకు కూడా ఆయన నూరు వరహాలకు తక్కువ ఇవ్వడు. అయితే ఆయన చేసేవి గుప్తదానాలు: మూడో కంటివాడికి తెలియవు. ఎందుకూ? రేపు మీరే చూస్తారుగా! ఇక మిమ్మల్ని భోజనానికి ఆహ్వానించటంలో విశేషమేమిటంటే ఇప్పటి వరకూ ఆయన చేసిన దానాలతో లక్ష పూర్తి అయింది. అందుకని ఆయన రేపు గుడిలో అభిషేకం చేయిస్తున్నారు. ఆ సందర్భంలో ఒక తగిన మనిషికి



భోజనం పెట్టాలని కూడా ఆయన నిశ్చయించారు. ఈ ప్రాంతాలలో ఆయనతో సరితూగగల దాత మీరే గనుక మిమ్మల్ని తప్పక రమ్మని చెప్పమన్నారు, అన్నాడు లోభి పంపిన నౌకరు.

దాత కొంచెం సేపు ఆలోచించి, 'సరే రేపు పెందలాడే వస్తున్నానని మీ యజమానితో చెప్పు,' అన్నాడు.

నౌకరు లోభి వద్దకు తిరిగి వచ్చి, తాను చెప్పిన మాటలన్నీ ఆయనతో చెప్పాడు. మర్నాడు దాత లోభి ఇంటికి వచ్చాడు. 'తమరు వెంట నౌకరయినా లేకుండా వచ్చారేమిటి?' అన్నాడు లోభి.

'చిన్న పని ఉండి మా నౌకరు దిగబడి పోయాడు. ఆ పని

పూర్తికాగానే వాడూ వస్తాడు లెండి,' అన్నాడు దాత.

'చూశారా? నేను ఇప్పటికి లక్ష వరహాలు దానం చేసి ఉన్నానన్న సంగతి మా నౌకరు మీకు చెప్పేశాడట. నా దానాలు గురించి ఇతరులకు తెలియటం నాకు సుతరామూ ఇష్టం లేదు సుమండీ, దాన ధర్మాలు చెయ్యడం ప్రధానం కాని, నాకు కీర్తి ప్రధానం కాదు. అందుచేత నా రహస్యాన్ని మీరు మరెక్కడా బయటపెట్టకండి! అన్నాడు లోభి.

లోభి వద్ద ఉండే నౌకరు తన యజమానితో, బాబూ, నేను గుడికి వెళ్లి అభిషేకాలు చేయించి వస్తాను,' అని బయలుదేరి ఇంటికి వెళ్లిపోయాడు. తరువాత వాడు ఒక ముసలి బిచ్చగాడి వేషం వేసుకుని తన యజమాని ఇంటికే వచ్చాడు. దాతతో మాట్లాడుతూ ఉండిన లోభి తన పక్కన పెట్టుకుని ఉన్న సంచీలో నుంచి నూరు వరహాలు తీసి దానం చేశాడు.

ముసలి బిచ్చగాడు వెళ్లిపోయిన కాస్సేపటికే ఒక బైరాగి వచ్చాడు. వాడికి కూడా లోభి నూరు వరహాలిచ్చి పంపాడు.

అది మొదలు భోజనాల వేళ అయ్యే లోపల ఒక మూగవాడూ, ఒక గుడ్డివాడూ, ఒక దాసరీ, ఒక యాత్రికుడూ, ఒక బుడబుక్కలవాడూ, ఈ విధంగా పదిమంది వచ్చారు. లోభి అందరికీ నూరేసి వరహాలు ఇవ్వటమే గాక, తన నౌకరు చాకచక్యంతో ఇన్ని వేషాలు మార్చిరావటం మెచ్చుకున్నాడు. దాత లోభితో, 'మీవంటి దాతను నేను



ఎక్కడా చూడలేదు, వినలేదు. ఈరోజే మీరు పదివేల వరహాలు ధర్మం చేసినట్లుంది!' అన్నాడు.

'లేదండీ, పదిమంది వచ్చారు. పది నూర్లు దానం చేశాను. ఇది నాకు పరిపాటే లెండి,' అన్నాడు లోభి.

మధ్యాహ్నానికల్లా లోభి నౌకరు తన మామూలు వేషంలో వచ్చాడు. వాడు యజమానితో, 'అయ్యా, లక్ష పత్రి పూజా అభిషేకం ఇప్పుడే పూర్తి అయ్యాయి. ఇదుగో ప్రసాదం తెచ్చాను,' అని చెప్పి పళ్లెంతో సహా ఇంట్లోకి వెళ్లాడు.

కాస్సేపటికి లోభి కూడా లోపలికి వెళ్లి నౌకరుతో, 'నాటకం మాబాగా ఆడావు! ఏదీ మన సొమ్ము?' అన్నాడు.

'ఇదుగో చూసుకోండి! ఐదువందలు!' అంటూ నౌకరు లోభికి డబ్బుమూట ఇచ్చాడు.

'అయిదు వందలేమిటి? నేను నీకు వెయ్యి వరహాలిస్తినిగా?' అన్నాడు లోభి. 'లేదండీ, నేను అయిదుసార్లే వచ్చాను. మీరు నూరేసి ఇచ్చారు,' అన్నాడు నౌకరు.

'మరి పదిమంది వచ్చారే! నువు ఐదుసార్లే వస్తే మిగిలిన అయిదుసార్లూ వచ్చినవాళ్లెవరూ?' అని లోభి ఆందోళన కొద్దీ గట్టిగా అడిగాడు.

'వాడు మా నౌకరు అయి ఉంటాడు లెండి,' అని దాత గొంతు వినిపించింది. యజమానీ నౌకరూ లోపల మాట్లాడుకునే సమయంలో ఆయన చల్లగా లోపలికి వచ్చి సంభాషణ అంతా విన్నాడు.

'మా నౌకరు కూడా ఇక వచ్చేశాడు. వాడు కూడా మంచి నమ్మకస్తుడే లెండి. మీరిచ్చిన అయిదు వందలూ ఎక్కడికీ పోవు!' అన్నాడు దాత.

లోభి ఆశ్చర్యావమానాలతో కుంగిపోయి ఏమీ అనలేక కొయ్యబారిపోయాడు.





# చెవుల్లేని వినాయకుడు

పూర్వం సిరిపురం రాజ్యాన్ని ప్రహ్లాద వర్మ అనే రాజు పరిపాలిస్తున్న రోజుల్లో జక్కన్న అనే గొప్ప శిల్పి ఆ ప్రాంతంలో ఉండే వాడు.

తన పూర్వీకుల నుండి వారసత్వంగా వచ్చిన శిల్ప విద్యలో ఎవరూ సాధించలేనంత నైపుణ్యాన్ని సాధించాడు జక్కన్న.

దాంతో ఎక్కడెక్కడ నుంచో జనం వచ్చి జక్కన్నని తీసుకెళ్ళి గుడుల మీదా, రాజభవనాల మీదా, మందిరాల మీదా అద్భుతమైన శిల్పసంపదని చెక్కించుకుంటూ ఉండేవారు.

ఒకసారి చందేరీ రాజులు తమ ప్రాంతంలో విశాలమైన ప్రాంగణంలో ఎన్నో దేవాలయాలు నిర్మించి, వాటిమీద అద్భుతమైన శిల్పాలు చెక్కే పనిని జక్కన్నకు అప్పగించారు. ఏళ్లకేళ్లు సాగే ఆ పనిని ఒప్పుకునే ముందే తన షరతులు వివరించాడు జక్కన్న.

ప్రతి ఏటా వినాయక చవితి పండుగకి నెల ముందుగా తమ ఊరు వెళ్లి, వినాయక నిమజ్జనం తర్వాత తిరిగి వచ్చి పని కొనసాగిస్తానన్నది అందులో ముఖ్యమైన షరతు.

సిరిపురం రాజ్యం మొత్తానికి ఉత్సవాల్లో ప్రతిష్టించే వినాయకుల దగ్గరనుంచి, ఇళ్లలో పూజలు చేసుకునే చిన్న మట్టి బొమ్మల వరకూ తన చేతుల్తోనే చేసి ఇవ్వడం జక్కన్నకి ఇష్టమైన పని.

'ఏ పని చేసినా దాని పూర్వాపరాలు, లోతుపాతులు తెలుసుకున్నాకే చెయ్యి. శిల్పాలు చెక్కడం అంటే రాతికి కళ్లు, ముక్కూ చెక్కడం కాదు. మనం దేని శిల్పం చేస్తున్నామో దాని తాలూకు ఆత్మ

పైడికొండల వెంకటేశ్వరరావు

శిల్పంతో స్పష్టంగా కనిపించాలి. అప్పుడే శిల్పి సమర్థత, సార్థకతా, ముఖ్యంగా దేవుడి శిల్పాలో, విగ్రహాలో చేసేటప్పుడు మరింత జాగ్రత్త అవసరం.

మనల్ని సృష్టించిన దేవుడినే మనం సృష్టిస్తున్నామంటే మనం దేవుడికన్నా పైనున్నామని ఊహించుకుని దేవుడికన్నా పైనున్నవాడు తన పని ఎలా చేస్తాడో, నువ్వు నీ పని అలా చేయాలి. ప్రజలంతా మొక్కే దేవుడి ప్రతిమలా ఉండాలి...'

తనకి శిల్పిగా శిక్షణ ఇస్తూ తండ్రి అన్న మాటల్ని మరోసారి మననం చేసుకుంటూ ఊరికి తిరిగొచ్చిన జక్కన్న రాజ్యంలోని పరిస్థితులు చూసి విస్తుపోయాడు.

పొలాలన్నీ ఎండిపోయాయి. పశువులు బిక్కచిక్కాయి. మనుషుల సంగతి సరే సరి. ఈసురోమంటూ ఉన్నారు. చెయ్యడానికి పనులే లేనట్టు అంతా రికామీగా ఉన్నారు.

ప్రజలు బావుంటేనే పండుగలూ, పబ్బాలూ. అవన్నీ ఉంటేనే తనలాంటివాడికి పని. రాజ్యంలో ఎప్పుడూ లేనిది ఇలాంటి పరిస్థితి ఏమిటో అర్థం కాలేదు జక్కన్నకు.

ఆరా తీస్తే తెలిసిందేమిటంటే పూర్తిగా సుఖాలు మరిగిన రాజు, రాజ్యం సంగతి పట్టించుకోవడం మానేసి, విలాసాల్లో మునిగి తేలుతున్నాడనీ, ఆయనలా ఉంటేనే తమ పబ్బం గడుస్తుందనీ తలిచిన మంత్రి ప్రభృతులు ఆయన్ని అంతా



సవ్యంగా ఉందన్న భ్రమలో ముంచి పగ్గాలు తమ చేతిలో ఉంచుకుని అధిక పన్నులు వసూలు చేస్తూ ప్రజల్ని పీడిస్తున్నారనీ, ఎవరైనా రాజుకి ఫిర్యాదు చేయడానికి వెళ్తే ఈయన్ని కలవనీయకుండా వాళ్లంతా అడ్డుకుంటున్నారనీ.

విషయం తెలుసుకున్న జక్కన్న రాజుని కలవడానికి ప్రయత్నించాడు. షరా మామూలుగా మంత్రి బృందం అతడిని అడ్డుకుని రాజుని కలవనివ్వకుండానే వెనక్కి పంపేశారు.

దాంతో పట్టుదల హెచ్చిన జక్కన్న ఇంటికి వచ్చేసి తీవ్రంగా ఆలోచించడం మొదలుపెట్టాడు.

వినాయకుడి విగ్రహాల కోసం మూసలు తయారు చేస్తూ ఉండగా అతనికో ఆలోచన తట్టింది.

ఫలితంగా వినాయక చవితినాడు సిరిపురం రాజ్యంలో ప్రతిష్టించబడిన ఏ



వినాయకుడి విగ్రహానికీ చెవుల్లేవు. అసలే పెద్ద పెద్ద చెవుల్తో ఉండే వినాయకుడి విగ్రహాలు, అసలు చెవులే లేకుండా ఉండేసరికి అంతా విస్తుపోయారు.

అసలే రాజ్యంలో పరిస్థితులు బాగో లేదు. ఈ రాజ్యానికేదో మూడింది.. అనుకుంటూ ప్రజలు బెంబేలు పడసాగారు.

విషయం తెలుసుకున్న మంత్రి బృందం తమతో వాగ్వివాదం పెట్టుకున్న జక్కన్నని శిక్షించే అవకాశం దొరికింది కదా అని గబగబా రాజు దగ్గరికి వెళ్లారు.

అప్పటికే అంతఃపురంలో పూజకోసం తెప్పించిన వినాయకుడి ప్రతిమకు కూడా చెవులు లేకపోవడం గమనించిన రాజు, జక్కన్న గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. మంత్రి బృందం మాటలతో రాజుకు కోపం అధికమై, వెంటనే జక్కన్నకు కబురు పంపాడు.

జక్కన్న అక్కడికి రాగానే, 'వినాయకుడి విగ్రహాలకి అవయవ లోపం పెట్టడం దైవాపచారం. అలా ఎందుకు చేశావు? అలా చేయడంలో నీ ఉద్దేశ్యమేమిటి?' అంటూ నిలదీశాడు.

'ఏ పని చేసినా దాని గురించి పూర్తిగా తెలుసుకుని చెయ్యమనేవాడు మా తండ్రి. వినాయకుడికి పెద్ద పెద్ద చెవులు ఎందుకుంటాయని అడిగితే అందరి ఆర్తి ఆలకించే ఆదిదేవుడు గనుక అందుకు ప్రతీకగా వినాయకుడికి చెవులు పెద్దగా ఉంటాయని పూజారిగారొకాయన చెప్పారు. అప్పట్నుంచి వినాయకుడిని చెవులు కొట్టొచ్చినట్లుగా కనబడేలా తీర్చిదిద్దేవాడిని. కానీ రాజ్యంలో పరిస్థితులు చూస్తుంటే దేవుడికి చెవులున్నట్లు ఏమీ అనిపించడం లేదు...

చెవిటివాడి ముందు శంఖం ఊదినట్లుగా ప్రజల ప్రార్థనలన్నీ అరణ్యరోదనలల్లా మారిపోతున్నాయి. అందుకే ప్రజల కష్టాలు వినని దేవుడికి చెవులెందుకని తీసేశాను!' అన్నాడు జక్కన్న.

జక్కన్న మాటలకి రాజు నిర్ఘాంతపోయాడు. 'రాజ్యంలో ప్రజలకు ఇప్పుడేమయింది?' అన్నాడు ఆశ్చర్యంగా. 'తను చేసిన తప్పుని కప్పిపుచ్చుకోవడానికి ఏవో కట్టుకథలు చెబుతున్నాడు ప్రభూ...' అంటూ

జక్కన్న మాటలకి అడ్డుపడుతున్న మంత్రిని ఆపి, జక్కన్న వైపు చెప్పమన్న ట్లుగా చూశాడు రాజు.

రాజ్యంలో నెలకొని ఉన్న పరిస్థితుల గురించి జక్కన్న ద్వారా తెలుసుకున్న రాజు, దానికి కారణం తనే అన్న తలపుతో సిగ్గుపడ్డాడు.

తనను తప్పుదోవ పట్టించిన మంత్రి బృందాన్ని పదవులనుంచి తొలగించి జైలు శిక్ష విధించాడు.

వాళ్ల స్థానాల్లోకి సమర్థులైన యువకుల్ని ప్రవేశపెట్టడం కోసం ప్రకటన చేయించమని ఆజ్ఞ జారీ చేశాడు.

చక్కని ఆలోచనతో మంత్రి బృందం నక్కజిత్తుల్ని చిత్తు చేసిన జక్కన్నను అభినందించాడు.

'ప్రభూ! దేవుడికి చెవులున్నాయో లేదో నిజంగా చూసినవాడు ప్రపంచంలో ఎవడూ లేడు. దేవుడు ప్రజల మొరలు ఆలకిస్తాడన్నది కేవలం నమ్మకం మాత్రమే. అయితే రాజయినవాడు ప్రజల కష్టాలు విని వాటిని తొలగిస్తాడన్నది కేవలం నమ్మకం కాదు. నిజం. అందుకే రాజుని దైవాంశ సంభూతుడంటారు. భూమ్మీద నడిచే దైవం అంటారు. అలాంటి రాజు కూడా చెవుల్లేని దేవుడిలా అయితే ప్రజల కష్టాలు ఎలా తీరతాయి?

అందుకే, ఇలా చేస్తే వాళ్ల అడ్డు లేకుండా మిమ్మల్ని సరాసరి కలిసే అవకాశం వస్తుందని ఇలా చేశాను. నిజానికి ఏ విగ్రహానికీ చెవులు పెట్టడం మానలేదు నేను. వాటిని ఊరకే మూసి ఉంచానంతే.

విగ్రహం రూపంలో చాలా చిన్న మార్పు చెయ్యడం వల్ల అది ఎవరికీ తెలియలేదు. చెవులు ఉండే ప్రాంతంలో సుత్తితో నెమ్మదిగా కొడితే మూసి ఉంచిన మృత్తిక ఊడిపోయి చెవులు బయటపడతాయి, అన్నాడు జక్కన్న.

మరోసారి జక్కన్నని అభినందించిన రాజు, తనకు కనువిప్పు కలిగించిన అతనికి ఒక అగ్రహారాన్ని నజరానాగా అందించాడు.





# సాలెవాడి చాతుర్యం

ఒకనాడు ఒక రాజుగారు సింహాసనం మీద కూర్చుని ఉండగా పొరుగు దేశపు రాజు వద్ద నుంచి ఒక దూత వచ్చి, రాజుగారి సింహాసనం చుట్టూ సుద్ద ముక్కతో ఒక వలయం గీసి, మాటా పలుకూ లేకుండా నిలబడ్డాడు.

రాజు తన మంత్రులను పిలిచి, 'వీడి ఉద్దేశం ఏమై ఉంటుంది?' అని అడిగాడు.

మంత్రులు ఏమీ చెప్పలేక తెల్లమొహాలు వేశారు. రాజు మండిపడి, 'దీనికి అర్థం చెప్పగల చతురుణ్ణి వెతికి తీసుకు రండి,' అని ఆజ్ఞాపించాడు.

మంత్రులు బెదిరిన కాకుల్లాగా అన్ని వైపులకూ వెళ్లి గాలించారు. వారిలో కొందరు ఒక ఇంటికి వచ్చారు. ఇంటి లోపల ఒక గదిలో ఉయ్యాల ఒకటి దానంతట అదే ఊగుతున్నది. డాబామీద ధాన్యం ఆరబోసి ఉన్నది. దానిని తినటానికి పక్షులు వేచి ఉన్నాయి. కాని ఎగువన ఉన్న పంఖా ఆడుతూ ఉండటం చేత అవి ధాన్యాన్ని సమీపించ లేకుండా ఉన్నాయి.

మంత్రులు మరొక గది ప్రవేశించి అక్కడ మగ్గం నేస్తున్న సాలెవాణ్ణి చూశారు.

'నీ ఇంట్లో ఈ విడ్డూరాలేమిటి? ఉయ్యాల దానికదే ఊగుతున్నది, పంఖా దానికదే ఆడుతున్నది!' అన్నారు వాళ్లు.

'వాటిని నేనే ఆడిస్తున్నాను. మగ్గం నుంచి ఉయ్యాలకొక తాడూ, పంఖాకొక తాడూ కట్టి ఉన్నాయి,' అన్నాడు సాలెవాడు.

'అద్భుతం! పరమాద్భుతం! నీవే మాకు కావలసిన చతురుడివి. మాకొక చిక్కు సమస్య వచ్చింది. కాస్త దాన్ని తెలివిగా విప్పగలవా?' అని మంత్రు

హెచ్. వీరేశలింగం

లడిగారు.

'ఏమిటా సమస్య?' అని సాలెవాడు అడిగాడు. మంత్రులు చెప్పారు.

సాలెవాడు కొంచెంసేపు ఆలోచించి, 'ఇది నేను వస్తే తప్ప తేలే విషయం కాదు,' అంటూ రెండు గోలికాయలు తీసుకుని వారి వెంట బయలుదేరి రాజుగారి వద్దకు వెళ్లాడు.

సాలెవాడు రాజుగారికి దణ్ణం పెట్టి, వలయాన్ని గమనించి, దూత కేసి ఒకసారి చూసి, తాను తెచ్చిన గోలీలను వాడి ముందు పడేశాడు.

వెంటనే దూత తన జేబు నుంచి గుప్పెడు జొన్నలు తీసి కింద పోశాడు.

సాలెవాడు చిరునవ్వు నవ్వుతూ, అవతలికి వెళ్ళి ఒక కోడిని తీసుకువచ్చి జొన్న గింజలమీదికి వదిలాడు. ఆ కోడి గింజలన్నిటినీ, ఒక్కటి మిగల్చకుండా తిన్నది. అది చూసిన దూత అతి వేగంగా అక్కడినుంచి నిష్క్రమించాడు.

'ఇదంతా ఏమిటో నాకు కొంచెం కూడా బోధపడలేదు,' అన్నాడు రాజు.

'మరేమీ లేదు మహారాజా, అవతలి రాజు మనని ముట్టడిస్తానని కబురు చేశాడు. మనం ఓటమి ఒప్పుకుంటామో, యుద్ధానికి సిద్ధమో తెలుసుకుందామని దూత వేచి ఉన్నాడు. మీరు గోలీలాడుకునే పిల్ల వెధవలు, అని సమాధానం చెప్పాను.

మాకు చాలా సేన ఉన్నది, అని చెప్ప టానికి వాడు జొన్నలు వెదజల్లాడు. ఒక్కణ్ణి కూడా మిగల్చమని కోడి ద్వారా నేనం మళ్లీ జవాబు చెప్పానం. ఆ సందేశం పట్టుకుని వాడం వెళ్లిపోయాడం,' అని సాలెవాడం వివరించాడు.

'భేష్! భేష్! నీవే నిజమైన తెలివి గల వాడివి! ఇక్కడే ఉండి పో. నిన్ను నా ప్రధానమంత్రిని చేస్తాను,' అన్నాడు రాజు సంతోషంగా.

'ఇంకా నయం! నాకవతల బోలెడంత పని ఉన్నది,' అంటూ సాలెవాడు దులుపుకుని వెళ్లిపోయాడు.



# నిలువ నీరు

భూషయ్య అనే ధనవంతుడు ఉండే వాడు. అతనికి తరగని ఆస్తి ఉంది. ఐనా అతను కష్టపడి పని చేసే వాడు. ఒక పక్కన రెండు చేతులా సంపాదిస్తూ ఇంకో వైపున దాన ధర్మాలు ధారాళంగా చేస్తుండే వాడు. భూషయ్యకి ఒక్కగానొక్క కొడుకు. అతని పేరు వీరేశం.

వీరేశానికి తండ్రి తీరు అర్థమయ్యేది కాదు. తరగని ఆస్తి ఉన్నా కష్టపడి పని చెయ్యడంలో అర్థమేమిటని తండ్రిని అడిగాడు. అప్పుడూ భూషయ్య నవ్వి, కొడుకుని ఒక జల్లెడ, ఒక కుండ, నీటితో నింపిన బిందె ఒకటి, తీసుకుని పెరట్లోకి రమ్మన్నాడు. ముందు జల్లెడలోకి నీరు నింపమన్నాడు. వీరేశం బక్కెట్టుతో నీళ్ళు తోడి జల్లెడలో పోశాడు. ఆ నీరంతా కారిపోయింది. తర్వాత నిండిన బిందెలో నీళ్ళు పొయ్యమన్నాడు. వీరేశం అలాగే చేశాడు. అప్పుడూ నీళ్ళన్నీ కిందకి ఒలికిపోయాయి. ఆపై కుండలో నీరు నింపమన్నాడు.

అప్పుడు తండ్రి వీరేశాన్ని, 'జల్లెడలో నీరు నిలవలేదెందుకు' అని అడిగాడు. 'జల్లెడ నిండా కన్నాలే కదా నాన్నా, నీళ్ళెలా నిలుస్తాయి' అన్నాడు వీరేశం. 'ఆస్తి ఉంది కదా అని కూర్చుని తింటే అదంతా అలాగే నిలవకుండా పోతుంది నాయనా' అని చెప్పాడు భూషయ్య.

వెంటనే వీరేశం ఏదో అర్థమైన వాడిలా, 'మరి బిందెలో నిండా నీళ్ళున్నాయి కదా. అందులో నీళ్ళెందుకు నింపడం? ఉన్న ఆస్తిని ఖర్చు పెట్టకుండా దాచుకోవచ్చు కదా' అని అడిగాడు.

భూషయ్య కొడుకు భుజం తట్టి, 'శెభాష్, మంచి ప్రశ్న వేశావు. ఆ నీళ్ళు అలాగే నిలవ ఉంటే ఎన్నాళ్ళు ఉపయోగపడతాయి నిలవ నీరు తాగడానికి పనికి రావు. ఎక్కువ నాళ్ళు ఉంటే మురికి చేరి హానికరంగా తయారవుతాయి. వాడని ఆస్తి కూడా అలాగే మరి! ఉన్న నీరు ఖర్చు పెట్టి కొత్త నీరు తోడుకుంటున్నట్లే స్వయంకృషితో ధనం సంపాదిస్తూ దాన్ని పది మందికీ ఉపయోగపడేలా సద్వినియోగం చేయాలి' అన్నాడు.

వీరేశంకి ఇప్పుడు తన తండ్రి మరింత బాగా అర్థం అయ్యాడు. – గోదావరి లలిత





# శిథిలాలయం - 30

(వెర్రి వెలగపండు తిన్న నాంగ్‌సోమ్ మతి చెడి కేకలు పెట్టసాగాడు. పూజారి అతణ్ణి పట్టుకుని, శిథిలాలయం కనుక్కునేందుకు బయలుదేరాడు. కొండ మీద శిఖిముఖి వాళ్లు అతణ్ణి ఎదిరించారు. ఆ సందర్భంలో జాంగ్‌లా గాయపడ్డాడు. శిథిలాలయం పూజారి కింద లోయలో పడిపోయాడు. నాంగ్‌సోమ్ లోయలోకి దూకేశాడు. తరవాత-)

నాంగ్‌సోమ్ శిథిలాలయం అంటూ అరిచి లోయంలోకి దూకటం చూస్తూనే శిఖిముఖీ, విక్రమకేసరీ నిర్విణ్ణులై పోయారు. గోల్‌భరా నుంచి ఎంతో నేర్పుగా అతడు పడవను నడిపి, ఈ వృశ్చికలంకకు చేర్చాడు. మార్గంలోనూ, ఇక్కడికి చేరింతరవాతా మొక్కవోని ధైర్యంతో తమకు సహాయపడ్డాడు.

అటువంటి విశ్వాసపాత్రుడు మతి భ్రమతో లోయలోకి దూకి ప్రాణాలు కోల్పోవడం, వాళ్లిద్దరికీ అంతులేని ఆవేదనను కలిగించింది.

'శిఖీ! మనం గొప్ప మిత్రుణ్ణి పోగొట్టుకున్నాం. ఈ వెర్రివెలగపండులో ఏవో మహత్తర శక్తులున్నవని నమ్మి, తిని ఘోరమైన చావు తెచ్చుకున్నాడు,' అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి ఏదో జవాబు చెప్పబోయేంతలో జాంగ్‌లా పెద్దగా మూలుగుతూ, 'శిఖిదొరా! నాంగ్‌సోమ్ చచ్చిపోయి వుండడు. ఆ దూకటంలో ఏ మహావృక్షం మీద అయినా పడివుంటే, దాని కొమ్మలు అతణ్ణి కాపాడే అవకాశం ఉంది. పైగా, అతడు శిథిలాలయం కనబడినట్లు కేకవేసి మరీ లోయలోకి దూకాడు. అందులో ఏమైనా వాస్తవం ఉండవచ్చు,' అన్నాడు.

ఈ మాటలు వినగానే శిఖిముఖి

దాసరి సుబ్రహ్మణ్యం



మనసులో కొంత ఆశ మొలకెత్తింది. అతడు జాంగ్‌లాను సమీపించి భుజం మీద చేయి వేసి ఆప్యాయంగా నిమిరి, 'జాంగ్‌లా! నీ స్వామి భక్తే కాక, ధైర్య సాహసాలు కూడా నాకెంతో ఆనందం కలిగిస్తున్నవి. నువ్వు పట్టుకోకపోతే ఆ శిథిలాలయం పూజారి మళ్ళీ చేజారి పోయి వుండేవాడు, జాంగ్‌లా భుజం మీద తగిలిన గాయం నుంచి కారిన రక్తం గడ్డకట్టిపోవడం చూసి, అరెరె! గాయానికి ఇంకా కట్టుకట్టలేదా?' అంటూ చుట్టూ కలయచూశాడు.

అదంతా గమనిస్తున్న వృశ్చికజాతి నాయకుడు చప్పున దాపుల ఉన్న పొదలోకి పోయి ఏదో ఆకుపసరు తెచ్చి, జాంగ్‌లా గాయానికి పూసి, కట్టు కట్టాడు.

అప్పుడు విక్రమకేసరి, జాంగ్‌లాతో, 'జాంగ్‌లా? నువ్వు చెప్పేదాన్ని బట్టి నాంగ్‌సోమ్ మాత్రమే కాక, దుష్టుడైన శిథిలాలయ పూజారి కూడా ఏ చెట్టు కొమ్మల మీదనో పడి బతికి ఉండవచ్చు కదా?' అని అడిగాడు.

'అవును దొరా! అలా జరిగితే ఆశ్చర్య పడవలిసిందేమీ లేదు,' అన్నాడు జాంగ్‌లా.

ఆ మాట వింటూనే వృశ్చిక నాయకుడు కోపంగా ఒక గెంతు గెంతి, 'బతికుంటే వాళ్లిద్దర్నీ పౌర్ణమినాడు వృశ్చికమాతకు బలి ఇస్తాను. వాళ్ళల్లో ఒకడు మోసకారి. రెండవవాడు వృశ్చికజాతి నాయకుడు మాత్రమే తినే అర్హత గల వెర్రివెలగపండు తిని మాతకు అపచారం చేశాడు,' అన్నాడు.

అతడి మాటలు విక్రమకేసరికి చాలా కోపం తెప్పించినై. అతడు చర్రున కత్తి దూసి, 'నువ్వు మొదటి నుంచీ ఈ లంక కంతా మహారాజువైనట్టు మాటాడుతున్నావు. మనుషుల్ని బలిపెట్టడం అంత చులకన అనుకుంటున్నావా? ఏదీ నీ శక్తి చూస్తాను. నీ ఆయుధం తీసుకుని ఇవతలికి రా!' అంటూ కొంచెం దూరంగా పోయి నిలబడ్డాడు.

వృశ్చికజాతి వాళ్లలో కలకలం బయలు దేరింది. వాళ్లు వాళ్ల నాయకుడి చుట్టూ చేరి గొడవగొడవగా మాట్లాడసాగారు. ఇలా నాలుగైదు నిమిషాలు గడిచింతర్వాత వృశ్చిక నాయకుడు, తన వాళ్లను తొలగ

దోసుకుని, రాతి గొడ్డలి పైకెత్తి విక్రమ కేసరిని సమీపించాడు.

ఇప్పుడు బలికన్న ఘోరమైన హత్య జరిగిపోనున్నదని శిఖిముఖి గ్రహించాడు. కేసరి ముందు వృశ్చిక నాయకుడు ఎందుకూ కొరగాడు. ఒక్క కత్తి విసురుతో అతడు వాణ్ణి ముక్కలుగా నరకగలడు!

శిఖిముఖి ఒక పెద్ద కేకతో వాళ్లిద్దర్నీ వారించి జాంగ్‌లాను వెంటబెట్టుకుని వాళ్ల మధ్యకు పోయి నిలబడి వచ్చీరాని ఇభ్యుజాతివాళ్ల భాషలో, 'వృశ్చిక నాయకా! నువు తొందరపడకు. కేసరి చేతిలో ఉన్న కత్తి పదును ముందు, నీ రాతిగొడ్డలి నిరుపయోగం. అసలీ పోట్లాటకు అర్థం లేదు. నువ్వింత వరకూ వృశ్చికమాత మందిరం ఎక్కడున్నదో కనుక్కోలేదు. అంతేకాదు నాంగ్‌సోమ్ బతికి ఉన్నదీ లేనిదీ కూడా మనకు తెలియదు,' అన్నాడు.

జాంగ్‌లా వృశ్చికనాయకుడికి అర్థ మయ్యే విధంగా శిఖిముఖి అన్న మాటలు వివరించి చెప్పాడు.

నాయకుడు కోపంతో ముక్కుపుటాలు అదురుతూండగా, 'ఈ లంక నాది! ఇక్కడికి వచ్చిన వాళ్లంతా నా బానిసలు,' అన్నాడు.

కోపంతో విక్రమకేసరి కత్తి ఎత్తబోయేంతలో శిఖిముఖి అతణ్ణి ఆపి, 'ఎవరూ ఎవరికీ ఇష్టమై బానిసలు కారు గదా? మా కన్న శక్తిమంతుడివని రుజువు చేసుకుని మాత్రమే నువ్వు మమ్మల్ని



బానిసలుగా చేసుకోగలవు. నీ మంచి కోసం చెబుతున్నాను. చూడు. ఈ కత్తి, నీ రాతి గొడ్డలి కన్న పదునైనది. గట్టిది, బలమైనది. నీవు దీన్ని మించిన ఆయుధం, శక్తీ సంపాయించుకున్ననాడు, మేము బహుశా నీకు బానిసలమవుతాం,' అన్నాడు.

వృశ్చిక నాయకుడికి, శిఖిముఖి చెప్పింది నాలుగు వాక్యాల్లో గబగబా చెప్పి, జాంగ్‌లా కేసరి చేతిలో ఉన్న కత్తి మీద తన మణికట్టును గట్టిగా ఆనించి, పైకి తీసి బొటబొట కారుతున్న రక్తాన్ని వృశ్చిక నాయకుడికి చూపుతూ, 'కత్తి పదును ఎలాంటిదో తెలిసిందా? ఇక శిఖిదొర చెప్పినట్లు విను,' అన్నాడు.

వృశ్చిక నాయకుడు కళ్లెర్ర జేసి, ఒక పొలికేక పెట్టి, చేతిలో ఉన్న రాతిగొడ్డలిని దూరంగా విసిరి, 'ధర్మయుద్ధం!



ఒడుపూ లేనందున, శిఖిముఖి అతణ్ణి తలమీదా, రొమ్ముల మీదా బలంగా పొడిచి, చివరకు ఒక్క ఊపుతో నేలమీదికి పడదోసి, ఒక చేత్తో అతడి గొంతు బిగబట్టి, రెండవ చేత్తో జుట్టు పట్టుకుని తలను ఒకటి రెండుసార్లు నేలకు వేసి గట్టిగా కొట్టాడు.

వృశ్చికనాయకుడు కళ్ళు తేలవేస్తూ, చేతులు రెండూ పైకెత్తి చిన్న గొంతుతో ఏదో అనసాగాడు. జాంగ్‌లా అతడి పక్కన వంగి, ఆ మాటలు విని, శిఖిముఖితో, 'శిఖిదొరా! ఇక వాణ్ణి ఒదలండి. ఆజన్మ బానిసనని వేడుకుంటున్నాడు,' అన్నాడు.

శిఖిముఖి చప్పున లేచి నిలబడ్డాడు. వృశ్చికనాయకుడు కూడా లేచి కూర్చుని ముందుకు వంగి శిఖిముఖి పాదాలు పట్టుకుని ఏమో గొణిగాడు. తమ నాయకుడు అలా చేయగానే వృశ్చిక జాతి వాళ్లంతా ఉన్న చోటనే ప్రణాచారం పడ్డారు.

శిఖిముఖి, వృశ్చిక నాయకుడిని లేవనెత్తి, 'మనిషి మరో మనిషికి ఏ పరిస్థితుల్లోనూ బానిస కానవసరం లేదు. జరిగిపోయింది ఇద్దరం మర్చిపోదాం. ఇక నుంచి మనం మిత్రులం!' అన్నాడు.

వృశ్చిక నాయకుడి కళ్లనుంచి నీళ్లు జలజలా కింద రాలినై. అతడు శిఖిముఖికి, విక్రమకేసరికీ తన కృతజ్ఞత చెప్పుకుని, తన జాతివాళ్లతో, 'ఇకనుంచి మనకందరికీ నాయకుడు. ఈ శిఖి దొర. ఆయన మాటకు తిరుగులేదు,'

ఆయుధం లేకుండా వట్టి చేతులతో పోరాడదాం,' అంటూ రొమ్ము చరిచాడు.

కత్తి కిందకు జార్చి, వృశ్చికనాయకుడితో కలియబడేందుకు విక్రమకేసరి పోబోయేంతలో, శిఖిముఖి అతణ్ణి ఆపి, ఈ వృశ్చిక తెగ నాయకుడితో పోరాడే హక్కు మరో తెగ నాయకుడి కొడుకుది. ఇతడి అనుచరుల్ని మాత్రం ఒక కంట కనిపెట్టి ఉండండి,' అంటూ వృశ్చిక నాయకుడి మీదికి లంఘించాడు.

ఇద్దరూ మహారోషంతో ముష్టి ఘాతాలిచ్చుకుంటూ, ఒకళ్లనొకళ్లు కింద పడదోసేందుకు తీవ్రంగా పోరాడసాగారు. వృశ్చిక నాయకుడు దేహబలంతో శిఖిముఖి కన్న మిన్న అయినా, శిఖిముఖి కున్న నేర్పూ



అన్నాడు.

తరవాత అందరూ చెట్లకింద కూర్చుని, వెంట తెచ్చుకున్న ఆహారం తిన్నారు. అప్పుడు శిఖిముఖి, విక్రమ కేసరితో ముందు తాము చేయవలసిన పనిని గురించి సంప్రతించాడు.

ఆ ఇద్దరికీ నాంగ్‌సోమ్ లోయలో ఎక్కడో సురక్షితమైన స్థానంలో పడి బతికే ఉంటాడన్న నమ్మకం ఉన్నది. ఆ సంభాషణ విన్న జాంగ్‌లా, 'నాంగ్‌సోమ్ ప్రాణాలతో ఉంటే, శిథిలాలయ పూజారి కూడా బతికే ఉండొచ్చు,' అన్నాడు.

వృశ్చిక నాయకుడు తనకున్న శంకను మరోసారి బయటపెట్టాడు. 'వెర్రివెలగ పండు మహ త్తు అమోఘమైనది. నాంగ్‌సోమ్ లోయలోకి దూకేముందు శిథిలాలయం అంటూ కేకపెట్టటం మతిభ్రమ వల్ల కాదు. అతడికి శిథిలాలయం కనబడే ఉంటుంది!'

'శిథిలాలయం మాట దేవుడెరుగు, ముందు ఆ లోయలోకి పోయి అతడు బతికున్నాడేమో చూసి, రక్షించవలసిన బాధ్యత మనమీద ఉన్నది. జాంగ్‌లా అన్నట్లు శిథిలాలయ పూజారి కూడా ఏ చెట్టు కొమ్మల్లోనో సురక్షితంగా దిగి ఉంటే, వాణ్ణి వేటాడవలసిన పనికూడా ఉన్నది. వెలుగు ఉండగా మనం ఆ లోయలోకి దిగుదాం,' అన్నాడు శిఖిముఖి.

'మీ ఆజ్ఞ దొరా! కాని ఆ లోయ చాలా భయంకరమైనది అక్కడ మహా సర్పాలూ, తేళ్లే కాక, ఏనుగులూ.., సింహాలూ.., పులులూ..'

వృశ్చిక నాయకుడు మాటలు ముగించక ముందే శిఖిముఖి అడ్డువచ్చి, 'ఈ లంకలో భయంకరంగా కాక, ప్రశాంతంగా, సౌమ్యంగా ఉన్న ప్రదేశం ఎక్కడుంది? నువ్వనే వృశ్చికమాత మందిరం ఆ లోయలోనే గదా ఉన్నది. ఆ ఆలయాన్ని కనుక్కొని, తిరిగి వృశ్చికమాతకు పూజా పునస్కారాలు చేయవలసిన బాధ్యత మీ జాతివాళ్లకు మాత్రం లేదా?' అని అడిగాడు.

'ఆ మాత కోసం ప్రాణాలిస్తాం, దొరా! కాని, నేను వెర్రివెలగపండు తిని ఉన్నట్లయితే, పౌర్ణమినాడు మాత మందిరం చేరి నరబలి ఇచ్చి

ఉండేవాడిని. నరబలి లేందే మాత కరుణించదు,' అన్నాడు వృశ్చిక నాయకుడు.

'ఆ బలులు సంగతి తరవాత మాట్లాడదాం... ముందు లోయలోకి దారి తీయండి,' అన్నాడు శిఖిముఖి.

అందరూ కొండమీది నుంచి లోయలోకి దిగసాగారు. వృశ్చిక నాయకుడు ముందు ఉండి దారి తీశాడు. అతడు చెప్పినట్లు లోయ చాలా భయంకరంగా ఉన్నది.

అక్కడ ఉన్న మహావృక్షాల్లో ఎక్కువ భాగం పెద్దపెద్ద ఊడలు దించుకున్న మర్రి చెట్లు. వాటి నీడల్లో ఏనుగులు తారట్లాడుతున్నవి. మరి కొన్ని చోట్ల సింహాలు కోరలు సాచి గర్జిస్తున్నవి. వాటి బోదెల నంటుకుని పెద్ద పెద్ద తేళ్లూ పారాడుతున్నవి.

శిఖిముఖీ అతడి అనుచరులూ ఆయుధాలు సిద్ధంగా ఉంచుకుని, తమ పరిసరాలు జాగ్రత్తగా పరీక్షించి చూసుకుంటూ లోయ అడుగుకు చేరారు.

శిఖిముఖి చెప్పగా, వృశ్చిక నాయకుడు కొండమీది నుంచి నాంగ్‌సోమ్ కిందికి దూకిన ప్రాంతానికి దారితీశాడు. ఆ ప్రదేశమంతా ఎత్తయిన వృక్షాలతో, వాటిని చిక్కగా అల్లుతూ పెరిగిన లతలతో క్రిక్కిరిసి ఉన్నది.

వృశ్చిక నాయకుడు తల ఎత్తి చెట్ల కొమ్మల కేసి చూస్తూ కొంత దూరం



నడిచి, చప్పున ఆగి, 'దొరా! నాంగ్‌సోమ్ దూకిన కొండ అంచు దిగువన మనం ఉన్నాం. అదుగో, ఆ కొమ్మల్లో ఏదో ఆకారం కనబడుతున్నది. కాని చెట్టును సమీపించటం ప్రమాదం. శిఖి దొరా! దానికింద ఏనుగు కుటుంబం కాపురం పెట్టినట్లున్నది,' అన్నాడు.

శిఖిముఖీ, విక్రమకేసరీ తల ఎత్తి పైకి చూశారు. వాళ్లకూ్కడా చెట్టుకొమ్మల్లో ఏదో మానవాకారం లాంటిది అస్పష్టంగా కనబడింది.

అది నాంగ్‌సోమ్ అవునో కాదో తేల్చుకోవాలంటే, ముందు చెట్టు కింద ఉన్న ఏనుగుల్ని బెదరకొట్టి పారదోలాలి. ఇంతా చేస్తే, ఆ కనబడేది నాంగ్‌సోమ్ కాక కొండమీంచి కాలుజారి పడిన ఏ ఎలుగుబంటో కావచ్చు...

శిఖిముఖీ, విక్రమకేసరీ

ఇలాంటి సంశయాలతో కొట్టుమిట్టులాడుతుండగా ఎర్రగండు పెద్దగా మొరిగింది. కుక్క అరవటం, అది తలఎత్తి చూస్తున్న దిక్కూ గమనిస్తూనే శిఖిముఖికి ఆ చెట్టుకొమ్మల్లో చిక్కుకుని వున్న ఆకారం నాంగ్‌సోవ్ అయి ఉంటుందన్న నమ్మకం కలిగింది.

'కేసరీ! మనం నేర్పుగా ఆ చెట్లకింద ఉన్న ఏనుగుల్ని దూరంగా తరమాలి. తరవాత చెట్టెక్కి, ఆ కనబడేది నాంగ్‌సోవేనేమో చూడవచ్చు,' అన్నాడతను.

శిఖిముఖి మాట ముగించే లోపలే, చెట్టుకింద ఉన్న ఏనుగుల్లో రెండు పెద్ద పెద్దవి భయంకరంగా ఘీంకరించి, తొండాలెత్తి వాళ్ల కేసి రాసాగినై.

అది చూస్తూనే వృశ్చిక నాయకుడు, 'అందరూ త్వరగా ఆ రాళ్ల చాటుకు పరిగెత్తండి. అక్కణ్ణుంచి బండరాళ్లు తోసి ఏనుగుల్ని బెదరగొట్టడం సాధ్యమేమో చూద్దాం,' అన్నాడు.

ఆ హెచ్చరిక వింటూనే ఒక్కసారిగా అందరూ కొండ అంచున ఉన్న రాళ్ల వెనక్కు పారిపోయారు. ఏనుగులు చెవులు టపటపలాడిస్తూ, తొండాలతో నేలను తాటిస్తూ, వాళ్లు దాగి ఉన్న వైపుకు కొంత దూరం పరిగెత్తుకు వచ్చి, అక్కడ ఉన్న బండరాళ్ల మధ్య కాళ్లకు పట్టు దొరక్క వెనక్కు పోసాగినై.

అదే అదనుగా శిఖిముఖీ వాళ్లు అక్కడ ఆసనాటుగా ఉన్న బండరాళ్లను వరుసగా వాటి కేసి దొర్లించారు. ఏనుగులు ఘీంకరిస్తూ వెనుదిరిగి అక్కణ్ణుంచి దూరంగా పరిగెత్తినై.

ఇప్పుడు అందరూ రాళ్ల చాటునుంచి బయటకు వచ్చి, జాగ్రత్తగా చెట్లకిందికి పోయారు. వృశ్చిక నాయకుడు తన జాతి వాణ్ణొకణ్ణి చెట్టెక్కమని చెప్పేంతలో కుంటి జాంగ్‌లా పట్టుకర్రను చెట్టుబోదెకు ఆనించి కోతిలా చెట్టు మీదికి గబగబా ఎగబాకి పోయాడు.

(ఇంకా వుంది)



# వింత పన్ను

కల్లోల రాజ్యాధిపతి తిక్కరాజు ఖాళీ అవుతున్న ఖజానా నింపడం ఎలా అని ఆలోచించసాగాడు. ఇంతలో ఒక భటుడు పరిగెత్తుకుంటూ వచ్చాడు. ఆయాసంతో ఊపిరి పీల్చుకుంటున్న భటుడిని చూడగానే తిక్కరాజుకి ఒక ఉపాయం తట్టింది. వెంటనే మహామంత్రిని పిలిపించి, కల్లోల రాజ్యంలో పీల్చే గాలిమీద పన్ను విధిస్తున్నట్లు, బ్రతికున్న ప్రతి ప్రాణీ ఇకపై గాలి పీల్చుతున్నందుకు పన్ను కట్టి తీరాలని తక్షణమే ఆదేశాలు జారీ చేశాడు. రాజ భటులు ప్రజల వద్ద నుండి పీల్చే గాలిపై పన్నులు వసూలు చేయసాగారు.

ఒకరోజు రాజభటులు ఒక యువకుడ్ని బంధించి తెచ్చి, పొరుగు రాజ్యం నుండి వర్తకం పనిమీద కల్లోల రాజ్యం వచ్చి ఆ రాత్రికి సత్రంలో బస చేసిన పునీతుడన్న ఆ యువకుడు గాలిపన్ను కట్టేందుకు నిరాకరించడంతో అతన్ని బంధించి తెచ్చినట్లు చెప్పారు.

తిక్కరాజు పునీతుడికేసి కోపంగా చూస్తూ, 'పొరుగు రాజ్యంవాడివైనా మా రాజ్యంలో ఉన్నంత సేపూ ఇక్కడి శాసనాన్ని గౌరవించి, ఇక్కడి గాలి పీల్చుతున్నందుకు పన్ను కట్టాల్సిందే,' అని కఠినంగా అన్నాడు. పునీతుడు చేతులు జోడించి, 'మహారాజా, మీ రాజ్యానికి వచ్చిన నేను ఎంత గాలి పీల్చుకుంటున్నానో, సరిగ్గా అంతే గాలిని మళ్లీ ఇక్కడే విడిచిపెడుతున్నా. కాబట్టి పీల్చిన గాలికి విడిచిపెట్టిన గాలి చెల్లుకు చెల్లు అవుతోంది. ఇక నేను పన్ను కట్టే అవసరం లేదు,' అని అన్నాడు.

పునీతుడి మాటల్లో నిజముందని భావించిన తిక్కరాజు అతన్ని విడిచిపెట్టవలసిందిగా భటులను ఆదేశించాడు. 'కల్లోల రాజ్యం పేరుకు తగ్గదే బతుకు జీవుడా!' అనుకుంటూ పునీతుడు అక్కడినుండి బయటపడ్డాడు.

– ఎమ్. మురళీ మోహన్





# ఘంటాకర్ణుడు

పిండారబోసిన వెన్నెలలో తాతయ్య తాంబూలం నములుతూ ఏదో ఆలోచిస్తూ కూచున్నాడు. చుట్టూ చేరిన పిల్లలు తాతయ్య బొడ్డులో ఉన్న పొడుం కాయకేసి, తాతయ్యకేసీ చూసి, ఏం శ్లోకం చదువుతాడా అని చూస్తున్నారు.

అంతలో మందారచెట్ల వేపు నుంచి ఏదో చప్పుడు వినపడింది. ఏమిటది? అని పిల్లలు ఒకరినొకరు ప్రశ్నించుకుని బిత్తరపోయారు. తాతయ్య తనలో తాను నవ్వుకుంటూ, పొడుంకాయ తీసి ఒక పట్టుపట్టి పీల్చి, ఇలా చదివాడు.

''శబ్ద మాత్రన్నభేతవ్య
మజ్ఞాత్వా శబ్ద కారణం;
శబ్దహేతుం పరిజ్ఞాయ
సుమంత్రో గౌరవం గతః''

ఈ శ్లోకం చదివి, 'అంటే అర్థమేమిటని అడగబోతారు కాదూ? అదీ చెబుతాను. ఆ శ్లోకానికి అర్థమేమిటంటే, ఏదైనా చప్పుడు ఎందుకు పుట్టిందీ, ఎలా పుట్టిందీ తెలియకుండా భయపడటం ఉందే అది మంచిది కాదు. సుమంత్రుడనే వాడు శబ్దానికి కారణం తెలుసుకోవడం చేతనే కదా గౌరవం పొందాడూ అని!' అన్నాడు.

పిల్లలు సంతోషంతో చప్పట్లు కొట్టి, 'కథ చెప్పు తాతయ్యా!, ఆ సుమంత్రుడెవరు? ఆ శబ్దం ఏమిటి?' అని ప్రశ్నల వర్షం కురిపించారు.

'ఉండదర్రా! ఆ కథ చెబుతానుగా!' అంటూ తాతయ్య ఇలా చెప్పాడు.

''శ్రీపర్వతం అని ఒక చోటు. ఆ శ్రీపర్వతం మధ్యగా బ్రహ్మపురమనే నగరం. దానికి శ్రీధరుడని రాజు. ఇందాక చెప్పిన సుమంత్రుడు ముఖ్యమంత్రి. శ్రీధరుడు ప్రజలను చక్కగా పరిపాలించేవాడంటే

సి. శేషాద్రి

అందుకు సగం కారణం సుమంత్రుడే.

ఉన్నట్లుండి నగరంలో ఒక పుకారు పుట్టింది. ఏమనీ? శ్రీపర్వతం మీద ఘంటాకర్ణుడనే రాక్షసుడొకడు చేరాడని. ఇది ఉత్త పుకారనుకునేరు. పర్వతం మీది నుంచి తరచు గంట మోగించిన చప్పుడు వినిపించేది. ఆ చప్పుడు విని ప్రజల పై ప్రాణాలు పైనే పోయాయి. ఘంటాకర్ణుడి భయంతో చాలామంది నగరం విడిచిపెట్టి పోయారు. పోనివారు ప్రాణాలు అరచేత పట్టుకుని భయంతో దడదడలాడిపోతున్నారు.

ఇది చూసి రాజుకు కష్టం వేసింది. ఆయన మంత్రి అయిన సుమంత్రుడితో 'మంత్రీ, ప్రజలకు ఈ భయం పోగొట్టటం మన విధి. అందుకేదైనా ఉపాయం నువే ఆలోచించాలి!' అన్నాడు.

సుమంత్రుడు 'అలాగే' అన్నాడు. ఆ గంట మోగటానికి కారణం తెలుసుకోవడం తన కర్తవ్యం అనుకుని ఆ చప్పుడు వినిపించే దిక్కుగా వెళ్లాడు. తీరా వెళ్లి చూస్తే రాక్షసుడూ, గీక్షసుడూ లేడు. ఒక కోతి చెట్లమీద తిరుగుతూ గంట వాయిస్తున్నది.

దానికా గంట ఎలా దొరికిందని అడగరేం? ఒక దొంగ ఒకనాడు ఆ గంటను ఎక్కడో దొంగిలించి అటుగా పోతుంటే ఒక పులివాణ్ణి చంపింది. ఆ గంటను ఒక కోతి ఎత్తుకుపోయి తనకు సరదా పుట్టినప్పుడల్లా వాయిస్తున్నది.

గంట చప్పుడుకు కారణం తెలిసిపోయిందిగా? సుమంత్రుడు పళ్లూ ఫలాలూ ఒక చోట పెట్టి కోతిని ఆకర్షించి, అది దూరంగా ఉంచిన గంటను కాస్తా తీసుకుని నగరానికి వచ్చేశాడు. జరిగిన సంగతి తెలిసి ప్రజలు భయపడటం మానుకున్నారు. రాజు సుమంత్రుడిని ఘనంగా గౌరవించాడు.

చూశారా? ఉత్తనే చప్పుళ్లు చూసి భయపడరాదు. చప్పుడుకు కారణం ఏమిటో తెలుసుకోవాలి!'' అన్నాడు తాతయ్య.



# ఆస్తిపంపకం

ఒక వర్తకుడికి ఇద్దరు కుమారులు. పెద్దవాడు స్వార్థపరుడు, చిన్నవాడు అమాయ కుడు. తన అనంతరం చిన్నవాణ్ణి పెద్దవాడు మోసం చెయ్యవచ్చునని వర్తకుడు తనకున్నదంతా రెండు మూటలలో పెట్టి, తాను చచ్చిపోబోతూ కొడుకులను పిలిచి, 'అబ్బాయిలూ, నాకున్నది యావత్తూ రెండు మూటలలో పెట్టి పడమటి గదిలో ఉంచాను. చెరొక మూటా తీసుకుని ఎవరి బతుకు వారు బతకండి,' అన్నాడు.

వర్తకుడు పోయాడు. దినవారాలు రేపు పూర్తి అవుతాయనగా పెద్దవాడు రాత్రివేళ పడమటి గది ప్రవేశించి, రెండు మూటలూ విప్పి చూశాడు. ఒక మూటలో పై భాగంలో వెండి నాణాలున్నాయి. కింది సగంలో మట్టి ఉండలున్నాయి. రెండో మూటలో పై సగంలో మట్టికుండలూ, కింది సగంలో వెండి నాణాలూ ఉన్నాయి. పెద్దవాడికి అర్థం కాలేదు. అందుచేత వాడు వెండి నాణాలన్నీ ఒక మూటలో పోసి, రెండో దానిలో మట్టి ఉండలన్నీ పోసి, మర్నాడు తన తమ్ముడితో, 'తమ్ముడూ, నాన్న చెరొక మూటా తీసుకోమన్నాడు. ఈ మూట నేను తీసుకుంటాను, అది నువు తీసుకో,' అని తాను వెండి నాణాల మూట తీసుకుని, తమ్ముడికి మట్టి ఉండల మూట ఇచ్చాడు.

తరవాత రెండోవాడు మట్టి ఉండలు మూటలో ఎందుకున్నాయా అని ఒక ఉండను పగలగొట్టి చూస్తే అందులో బంగారు నాణెం ఉన్నది. వాడికి వచ్చినది బంగారు నాణాల మూట!





# గొప్పవాడు

పూర్వం మగధను పాలించే నృసింహవర్మకు తన రాజ్యంలో గొప్పవారెవరో తెలుసుకోవాలన్న కోరిక కలిగింది. వెంటనే మహామంత్రి సుబుద్ధిని పిలిచి ప్రశ్నించాడు. అప్పుడు సుబుద్ధి 'మహారాజా! మన రాజ్య ప్రజలు అందరూ గొప్పవారే. వారి గొప్పదనం ఆయా సందర్భాల్లో వారు చేసే పనిని బట్టి ఆధారపడి ఉంటుంది,' అని అన్నాడు . రాజుకు ఈ సమాధానం నచ్చలేదు. వెంటనే మంత్రితో 'మీ సమాధానంతో నేను ఏకీభవించను. మీరు ఇచ్చిన సమాధానాన్ని నిరూపిస్తారా?' అని ప్రశ్నించాడు. మంత్రి, 'అవకాశం వచ్చినప్పుడు తప్పనిసరిగా నిరూపించి తీరుతాను,' అని బదులు ఇచ్చాడు.

ఒకసారి నృసింహవర్మ శత్రుదేశమైన విదర్భపై దండెత్తాలనుకున్నాడు. సైన్యాన్ని సమాయత్తం చేయించి అర్ధరాత్రి విదర్భ పొలిమేరల్లో సైన్యాన్ని నిలిపాడు. నృసింహవర్మ, సుబుద్ధి మారువేషాలలో ఆ అర్ధరాత్రి విదర్భ రాజ్య స్థితిగతులను రహస్యంగా తెలిసికొనుటకై ప్రవేశించారు.

వారు కొద్ది దూరం వెళ్లగానే రాజభటులు వారిని దొంగలుగా అనుమానించి పట్టుకుని కారాగ్రహంలో బంధించారు. నృసింహవర్మ, సుబుద్ధిలు ఇద్దరూ అదృష్టవశాత్తూ కారాగ్రహంలోని ఒకే గృహంలో బంధించబడ్డారు. వారితోపాటు ఆ చెరసాల గదిలో గంగులు అనే దొంగ కూడా ఉన్నాడు. అతడు వారిద్దరినీ చూసి, వీరి మెడలోని రత్నాల హారాలు, చేతులకున్న బంగారు కడియాలు చూసి వాటిని ఎలాగైనా తస్కరించాలనుకున్నాడు. కాని చెరసాలలో ఇది సాధ్యం కాదు కనుక వీరిని బయటకు తప్పించి సొమ్ము

ఎస్. రామకిష్టయ్య



బహుమతిగా ఇచ్చారు. బిత్తరపోయిన గంగులు వాటిని స్వీకరించి వారికి కృతజ్ఞతలు తెలిపి తన దారిన తను వెళ్లిపోయాడు.

అప్పుడే తెల్లవారుతున్నది. రాజు, మంత్రి ఆ మసక చీకట్లో దారి తప్పి ఒక అడవి ప్రదేశం లోనికి వచ్చారు. ఆ అడవి గుండా వారు నడుస్తున్నప్పుడు అనుకోకుండా ఒక చిరుతపులి వారిపై దుమికింది. ఆయుధాలు లేకపోవడం వలన వారు తమకిక చావు తప్పదనుకుని పెడబొబ్బ పెట్టారు. ఇంతలో అక్కడికి వచ్చిన ఒక ఆటవికుడు ఆ చిరుతపులిని తన చేతిలోని బల్లెంతో ఒక్కపోటు పొడిచాడు. ఆ దెబ్బకు చిరుతపులి మరణించింది. రాజు, మంత్రీ ఆ అటవికుని 'ఎవరు నీవు?' అని ప్రశ్నించేంతలో వీరి భాష అర్థం కాని అతడు పరుగెత్తుకుంటూ వెళ్లిపోయాడు. బ్రతుకు జీవుడా అనుకుంటూ ఆ దినమంతా వారు నడిచి, నడిచి చివరికి సాయంత్రం తమ విడది చేరుకున్నారు. ఆ రాత్రి ఇద్దరూ చాలా అలసటగా ఉండటం చేత త్వరగా నిద్రపోయారు.

ఇంతలో అర్ధరాత్రి రాజు, మంత్రి నిద్రించిన గుడారంలో అకస్మాత్తుగా మంటలు చెలరేగాయి. వెంటనే ఒక సైనికుడు ముందుగా రాజుగారిని తర్వాత మంత్రిగారిని మంటల నుండి బయటకు తెచ్చాడు. ఈ ప్రమాదంలో సైనికుడు కొద్దిగా గాయపడ్డాడు. రాజు, మంత్రి మాత్రం ఈ ప్రమాదం నుండి క్షేమంగా బయటపడ్డారు. తెల్లవారి రాజుగారు తాను విదర్భపై ప్రస్తుత

దొంగిలించాలనుకున్నాడు. ఆ విషయం వారికి చెప్పకుండా తాను ఈ తెల్లవారకముందే తప్పించుకు పోతున్నట్లు చెప్పి, వారికి కూడా అభ్యంతరం లేకపోతే తనతో పాటు రావల్సిందిగా కోరాడు. అందుకు రాజు, మంత్రి సంతోషంగా అంగీకరించారు. గంగులు ఆ చెరసాలకున్న చిన్న కిటికీ ఊచలను విరుస్తానని, తర్వాత ఒక్కరొక్కరు బయటకు వెళ్లాలని చెప్పాడు. తాను అన్నమాట ప్రకారం గంగులు ఆ కిటికీ ఊచలను వంచాడు. వెంటనే క్రిందకు దూకి ముందుగా రాజుగారిని, తర్వాత మంత్రిని బయటకు పంపించాడు. ఆ తదుపరి తాను బయటకు వచ్చాడు. అప్పుడు రాజు, మంత్రి అతనికి బహుమానంగా తమ మెడలో ఉన్న బంగారు ఆభరణాలను, కంకణాలను

పరిస్థితుల్లో దండయాత్ర మానుకుంటున్నట్లు చెప్పాడు. సైన్యం మొత్తం కూడా తిరిగి మగధకు ప్రయాణ మైంది. అప్పుడు మంత్రి రాజుతో, 'మహారాజా, నేను ఆనాడు చెప్పినట్లే జరిగింది. మీరు ఎవరు గొప్పవారని నన్ను ప్రశ్నించారు. అదే ప్రశ్నను ఇప్పుడు మిమ్మల్ని అడుగుతున్నాను. మనలను చెరసాల నుండి కాపాడిన దొంగ గొప్పవాడా! చిరుతపులి నుండి కాపాడిన ఆటవికుడు గొప్పవాడా! తన ప్రాణాలకు తెగించి మనను అగ్ని ప్రమాదం నుండి కాపాడిన మన భటుడు గొప్పవాడా?' అని ప్రశ్నించాడు. 'అందరూ గొప్పవారే,' అన్నాడు రాజు. 'ఈ మాట నేను ఆనాడే చెప్పాను. వారు చేసిన ఆయా పనులను బట్టి వారి గొప్పదనం ఆధారపడి ఉంటుందని, ఇప్పటికైనా మీరు ఒప్పుకుంటారా,' అని అడిగాడు మంత్రి. రాజు అంగీకరించాడు.

అప్పుడు మంత్రి 'మహారాజా, అందరికన్నా మీరు గొప్పవారు. ఎందుకంటారా? విదర్భపై దండయాత్ర కని వెళ్లి, మీ నిర్ణయం మార్చుకుని తిరిగి శాంతికాముకులై వస్తున్నారు తలుచుకుంటే మీకు విదర్భ ఒక్క నిమిషంలో హస్తగతమౌతుంది. కాని ఎందువల్లనో ఆ నిర్ణయం మార్చుకుని గొప్పవారయ్యారు,' అని అన్నాడు మంత్రి సుబుద్ధి. రాజు వెంటనే, 'మీలాంటి మంత్రి నాకు ఆపదలో చేదోడు వాదోడుగా ఉండగా నేను గొప్పవాడినేమిటి? మీరే గొప్పవారు,' అని అన్నాడు రాజు. అపుడు మంత్రి 'అవును మహారాజా! మన రాజ్యంలోని పౌరులందరూ గొప్పవారే,' అన్నాడు. వెంటనే రాజు, 'మన రాజ్యంలోని వారే కాకుండా ఇతరులు కూడా గొప్పవారే. అందుకు దొంగ, ఆటవికుడే నిదర్శనం అందుకే నేను అమాయకులైన ఇతర రాజ్యాల ప్రజలపైన దండయాత్ర ఏమిటి? అని నా నిర్ణయాన్ని మార్చుకు న్నాను,' అని అన్నాడు. ఇద్దరూ ముసి ముసి నవ్వులు నవ్వుకున్నారు.





# చిదంబర రహస్యం

ఒక ఊళ్లో చిదంబరం అనే షావుకారు ఉండేవాడు. అతడు పరమలోభి. కాని అతని భార్యకు ధానధర్మాలంటే ఆసక్తి.

ఒకప్పుడు పండక్కి గ్రామస్థులందరూ చందాలు వేసుకుని, హరిదాసు గారి చేత కాలక్షేపం చేయించడానికి ఏర్పాటు చేసుకున్నారు. చిదంబరం ఒక్క పైసా అయినా ఇవ్వక, 'నాకిలాంటి డబ్బు దండగ పనులు ఇష్టం లేదు. నాకీ కాలక్షేపాలేవీ అక్కర్లేదు,' అని ఖచ్చితంగా చెప్పేశాడు.

ఆ క్షణం నుంచి భార్యాభర్తల మధ్య కలహం ప్రారంభమైంది. 'డబ్బివ్వకపోతే పోయె. ముక్తి మార్గం తెలుసుకోవడానికి ముచ్చటగా మూడే మూడు ముక్కలు విని రాకూడదా?' అని భార్య పట్టు పట్టింది. ఇల్లాలి పోరు ఇక పడలేక, సరే లెమ్మని చిదంబరం కాలక్షేపంలో మూడే మాటలు వినటానికి బలవంతంగా ఒప్పుకున్నాడు.

ఆరాత్రి కాలక్షేపానికి పెద్ద మర్రి కింద పందిట్లో ఏర్పాట్లు జరిగాయి. జనం కిటకిటలాడుతున్నారు. చిదంబరం కూడా వచ్చి ఒక పక్క కూర్చున్నాడు.

హరిదాసు గారు పూలమాల వేసుకుని, కాళ్లగజ్జెలు కట్టుకుంటూ ఉండగా, గ్రామాధికారి సభవేపు తిరిగి, 'పెద్దలంతా వచ్చినట్లేనా, ఇంకెవరైనా రావాలా?' అని అడిగాడు. 'ఓహో, ఇది దాసుగారు చెప్పే మొట్టమొదటి మాట కావాలు. వినవలసిన మూడు మాటల్లోనూ అప్పుడే ఒకటి వినేశాను' అనుకున్నాడు చిదంబరం.

అంతలోనే చోటు చాలక జనం కొంత మంది నించుని, కూర్చున్న వాళ్లకి అడ్డంగా ఉన్నారు. గ్రామాధికారి మళ్లీ

జలదంకి వెంకటయ్య

లేచి, 'కూర్చోండి! కూర్చోండి!' అంటూ వాళ్లను హెచ్చరించాడు. ఇదే రెండో మాట అనుకున్నాడు చిదంబరం.

జనం విపరీతంగా రావడం వల్ల స్థలం లేక కొంతమంది వచ్చిన దారినే వెళ్లిపోవలసి వచ్చింది. అప్పుడు గ్రామాధికారి, 'వెళ్లకండి! వెళ్లకండి! దాసుగారు వచ్చేస్తున్నారు!!' అని మళ్లీ జనానికి నచ్చచెప్పాడు. ఇది విని చిదంబరం, 'సరే, నేను వినవలసిన మూడు మాటలూ పూర్తి అయినాయి,' అనుకుని ఇంటికి వచ్చేసి హాయిగా నిద్రపోయాడు.

ఈ సంగతి తెలియక, ఎంత చెప్పినా తన మాట భర్త చెవికెక్కలేదు కదా అని కోపం కొద్దీ చిదంబరం భార్య పిల్లల్ని వెంటబెట్టుకుని కాలక్షేపానికి వెళ్లిపోయింది. ఆ సందట్లో ఆమె ఇంటికి తలుపు వెయ్యడం మరిచిపోయింది.

ఇదంతా కనిపెట్టి చూస్తున్న దొంగలు ఆమె వెళ్లిపోగానే ఇంట్లో చొరబడ్డారు. మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ, గదిలోకి వెళ్ళేసరికి, చిదంబరం, 'పెద్దలంతా వచ్చినట్లేనా, ఇంకెవరైనా రావాలా?' అని పలవరించాడు.

దొంగలు అదిరిపడ్డారు.

ఇంటి యజమాని మేలుకునే ఉన్నాడని తెలుసుకుని, ఎక్కడివాళ్ళక్కడే చతికిలబడ్డారు.

అప్పుడు చిదంబరం, 'కూర్చోండి! కూర్చోండి!' అని గ్రామాధికారి చేసిన హెచ్చరిక పలవరించాడు.

'అరే, మనం కూర్చోవటం కూడా ఈయనకి తెలిసిందే! మనల్ని చూసే ఉంటాడు,' అని అనుకుని, ఒక్కొక్కళ్లే లేచి పోవడానికి సిద్ధపడ్డారు.

అంతలో నిద్రపోతున్న చిదంబరం మళ్లీ 'వెళ్లకండి, వెళ్లకండి! దాసుగారు వస్తున్నారు!!' అని పలవరించాడు.

ఇంటి యజమాని తమను తరుముకు వస్తున్నాడని భయపడి, వెనక్కి కూడా తిరిగి చూడకుండా దొంగలు కాలికొద్దీ పరుగుచ్చుకున్నారు.



Log onto www.chandamama.com



# YOUR CHANDAMAMA IS AVAILABLE IN MANY AVATARS!



## Junior Chandamama

**(4+ age group):**

A magazine for the little ones peppered with activities, pictures, and stories that will grip their imagination !




## Regional Chandamama

Read your favourite stories in your own language! Chandamama takes you closer home even as your imagination soars!









## Chandamama English

**(9+ age group)**

A children's magazine that has adapted itself to the changing needs of children across decades, Chandamama English offers you a delectable mix of the classic and the contemporary in 70 pages that value fun!

**Revamped** **Relevant**
**Redesigned** **Read it!**

**YOUR LANGUAGE, YOUR CHANDAMAMA.**

**Available in 11 languages:**

Telugu, Hindi, Marathi, Oriya, Kannada, Bengali, Tamil, Malayalam, Gujarati, Assamese, Sanskrit.

# కెరీర్ అంటే?




ఈనెల మనం సామాజిక పని అనే మరింత ఆసక్తికరమైన అంశం గురించి తెలుసుకుందాము.

సామాజిక పని అనేది సమాజంలో సానుకూల మార్పును తీసుకురావడానికి కొంతమంది వ్యక్తులు పూనుకోవడం అనే అర్థాన్ని అధిగమించిన వృత్తిగా మారింది. ఇది అత్యున్నత నైపుణ్యం కలిగిన వ్యక్తులకు సంబంధించిన వృత్తిగా మారింది. సామాజిక పని పట్ల సాదా సీదా మనస్తత్వం స్థానంలో నిబద్ధత కలిగిన వృత్తిపరమైన ప్రవత్తిని ఇది తీసుకొచ్చింది. కాని దీని ప్రాథమిక అంశాలు మాత్రం అలాగే ఉన్నాయి.



సమాజ ఉద్ధరణ, అన్యాయాలను రూపు మాపటం పట్ల ఎవరికైనా దృఢమైన కాంక్ష ఉండాల్సిందే. ఈ వృత్తికి అవసరమైన ముఖ్యమైన కౌశలం ఏదంటే ఏ వైవిధ్యపూరితమైన, కఠిన పరిస్థితులలో కూడా పనిచేయగలిగిన సామర్థ్యాన్ని కలిగి ఉండటమే. అద్భుతమైన భావ వ్యక్తీకరణ, మానవ సహసంబంధాలకు సంబంధించిన నైపుణ్యాలు ఈ వృత్తికి తప్పనిసరి లక్షణాలు.

వీటికి మించి, సకల జనుల అభివృద్ధిలో విశ్వాసం కలిగి ఉండటం దాన్ని నెలకొల్పడంలో సృజనాత్మక వైఖరి కలిగి ఉండటం కూడా అవసరం.

ఈ రంగంలో పారితోషకం ప్రధాన స్రవంతి వృత్తులకు సమానంగా లభిస్తోంది. సరైన ప్రతిభా సామర్థ్యాలతో ఈ రంగంలో ఎవరైనా మంచి జీవితం పొందవచ్చు. మీరు ఏ రంగంలో స్పెషలైజేషన్ చేశారనే దానిపై ఆధారపడి ఈ రంగంలో ఉపాధి అవకాశాలు ఉంటాయి.

- ఎమ్ఎన్‌సిలలో మరియు వివిధ పరిశ్రమలలోని మానవ వనరుల విభాగాల్లో కార్మిక సంక్షేమ అధికారులలాగా కార్మిక సంక్షేమ నిపుణులు పనిచేస్తారు.
- సామాజిక కృషి రంగంలో మాస్టర్స్ డిగ్రీ చేశాక, పలు భారతీయ, ఐక్యరాజ్య సమితి సంస్థలలో సలహాదారులుగా పనిచేయవచ్చు.
- సామాజిక కృషి రంగంలో బోధన మరొక ఐచ్ఛికాంశంగా ఉంటుంది.
- వైద్య, మనస్తత్వ అధ్యయన రంగాల్లో నిపుణులు ఆసుపత్రులలో, క్లినిక్‌లు, కౌన్సెలింగ్ కేంద్రాలు, మానసిక వ్యాధుల ఆసుపత్రులు, వృద్ధాశ్రమాలు మరియు ఎన్జీవోలలో ఉపాధి పొందవచ్చు.

– సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 44

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు( 16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ –44అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. అక్టోబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. డిసెంబర్ 2012 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## ప్రపంచ సముద్రాలు

1. శీతాకాలంలో గడ్డకట్టుకుపోయే రెండు సముద్రాల పేరు చెప్పండి.
2. కన్యాకుమారి వద్ద కలిసే మూడు సముద్రాలు ఏవి?
3. టర్కీ, గ్రీస్‌లను వేరు చేస్తున్న సముద్రం ఏది?
4. ప్రపంచ సముద్రాలనుంచి దాదాపుగా వేరుగా ఉంటున్న సముద్రం ఏది.
5. భూమీమ్మద రెండో అతి పెద్ద సముద్రంగా పేరొందినది ఏది?
6. 2009లో ఏ సముద్రంపై భారీ ఎత్తున చమురు తెట్టు ఏర్పడింది.
7. ఆఫ్రికాలోని నైలునది ముఖ భాగంగా పేరొందిన పేరు చెప్పండి.
8. ప్రపంచంలో అతి చిన్న సముద్రంగా గుర్తించబడిన దాని పేరు చెప్పండి.
9. ప్రపంచంలో అత్యంత లోతైన సముద్రం ఏది?
10. చైనా మరియు కొరియా మధ్య పసిఫిక్ మహా సముద్రం యొక్క ఛాయగా పేరొందిన సముద్రం ఏది?

### చందమామ లోకజ్ఞానం క్విజ్–41 సమాధానాలు:

1. కర్ణ/పాండవులు 2. కృష్ణ 3. తుంబురుడు, 4. శకుని, 5. యుధిష్టరుడు, 6. పంచజన. 7. అశ్వత్థామ.

*జూన్'12 నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.*



# నవ్వుల పువ్వులు

పిల్లవాడు : నాన్నకు తలమీద వెంట్రుకలు లేవెందుకమ్మా?
అమ్మ : ఎందుకంటే ఆయన ఎక్కువగా ఆలోచిస్తాడు.
పిల్లవాడు : మరి నీ తల మీద ఎక్కువ వెంట్రుకలు ఉన్నాయి ఎందుకనీ?



వీధిలో ఒక మనిషి ఒక డాక్టర్‌ని ఆపి ఇలా అన్నాడు, మీకు గుర్తుందా, నా కీళ్ల నొప్పులను పదేళ్ల క్రితం మీరే నయం చేశారు.

అవును గుర్తుంది, చెప్పాడు డాక్టర్.

మంచిదండీ. కాని నన్ను స్నానం చేయవద్దని కూడా అప్పట్లో చెప్పారు మీరు. ఇప్పటికీ మీరలాగే భావిస్తున్నారేమోనని ఆశ్చ ర్యంగా ఉందండీ..!

వినీత్ : పునీత్, మీ నాన్న టీచర్. కాని మీ పెద్దక్కయ్య అక్షరమ్ముక్క కూడా చదవలేదేమిటి?
పునీత్ : అయితే ఏంటి? మీ నాన్న దంతవైద్యుడు కాని మీ చిన్న తమ్ముడికి చిన్న పన్ను కూడా లేదేంటి మరి?

వీధి మూలలో ఉన్న సరుకులు దుకాణంవద్ద చోటు నిలబడి కూరగాయల వ్యాపారికి తను తెచ్చిన జాబితా చదివి వినిపిస్తున్నాడు.

10 కిలోల చక్కెర కిలోకి రూ. 1.25 లెక్కన
4 కిలోల కాఫీ కిలోకి రూ. 1.50 లెక్కన
2 కిలోల వెన్న కిలోకి రూ. 1.10 లెక్కన
2 సబ్బు బిళ్లలు ఒక్కొక్కటి రూ. 0.83 లెక్కన

'వీటన్నింటికీ ఎంతవుతుంది,' అడిగాడు రాము.

'ఇరవైరెండు రూపాయల ముప్పయ్యారు పైసాలు,' చెప్పాడు వ్యాపారి.

'మీకు నేను పది రూపాయల బిల్లులు మూడు ఇచ్చినట్లయితే, నాకెంత చిల్లర వస్తుంది?' అడిగాడు రాము.

'ఏడు రూపాయల అరవైనాలుగు పైసలు వస్తుంది', చెప్పాడు కూరగాయల వ్యావారి విసుక్కుంటూ.'

తలుపు గుండా మాయమవుతూ రాము చెప్పాడు, 'అయ్యా నాకు నిజంగానే కూరగాయలు అక్కర్లేదు. నా లెక్కల సమస్య తీర్చుకుందామనీ...?'



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | Has the Principal come? | What is your pay-scale? |
|---|---|---|
| Telugu | ప్రిన్సిపాల్ వచ్చారా? | మీ వేతనం ఎంత? |
| Hindi | क्या प्रधानाध्यापक आये हैं?<br>క్యా ప్రధానాధ్యాపక్ ఆయే హై? | आपका वेतन-मान क्या है?<br>ఆప్‌కా వేతన-మాన్ క్యా హై? |
| Tamil | கல்லூரி முதல்வர் வந்துவிட்டாரா?<br>కల్లూరి ముదలవర్ వందు విట్టారా? | உன்னுடைய சம்பளம் எவ்வளவு?<br>ఉన్నుదియ సంబలం ఎవలవు? |
| Bengali | অধ্যক্ষ এসেছেন কি?<br>అధ్యక్షో ఎశ్చెన్ కి? | আপনার মাহিনা কত?<br>ఆప్‌నార్ మాహినా కటో? |
| Marathi | प्राचार्य येणार आहेत का?<br>ప్రచర్య ఎనర్ అహెత్ కా? | तुमचा पगार किती आहे?<br>తుమ్‌చ పగర్ కిటి అహె? |
| Kannada | ಪ್ರಾಂಶುಪಾಲರು ಬಂದರೇ?<br>ప్రామ్‌శుపాలరు బందారే? | ನಿಮ್ಮ ವೇತನ-ಶ್ರೇಣಿಯೇನು?<br>నిమ్మ వేతన-శ్రేణియెను? |
| Odia | ଅଧକ୍ଷ ଆସିଲେଣି କି?<br>అధ్యక్ష్య ఆశెలిణి కి? | ଆପଣଙ୍କର ବେତନ ସ୍କେଲ କେତେ?<br>అపణంకర బెతన స్కేల్ కెటె? |
| Gujarati | પ્રિંસીપાલ આવ્યા છે?<br>ప్రిన్సిపాల్ ఆవ్యా చె? | તમારું પગાર-ધોરણ શું છે?<br>తమారు పగార్-ధొరణ షు ఛె? |
| Assamese | অধ্যক্ষ আহিলে নেকি?<br>అధ్యఖ్య అహిలె నెకి? | তোমাৰ পে-স্কেল কি?<br>తుమార్ పే-స్కేల్ కి? |
| Malayalam | പ്രിൻസിപ്പാൾ വന്നുവോ?<br>ప్రిన్సిపల్ వన్నువొ? | നിങ്ങളുടെ ശമ്പളം എത്രയാണ്?<br>నింగలుడె సంబళం ఎథ్రయును? |
| Sanskrit | मुख्याध्यापक: आगत: वा?<br>ముఖ్యాధ్యాపకః ఆగతః వా? | का तव वेतनश्रेणी ?<br>కా తవ వేతనశ్రేణి? |





| English | Did you read the newspaper? | I'll call his mother |
|---|---|---|
| Telugu | మీరు వార్తాపత్రిక చదివారా? | నేను అతడి తల్లిని పిలుస్తాను. |
| Hindi | क्या आपने अखबार पढा?<br>క్యా అప్‌నే అఖాబార్ పఢ? | मैं उसकी माँ से बात करुंगा/करुंगी<br>మె ఉస్‌కి మన్ సె బాత్ కరుంగా /కరుంగి |
| Tamil | நீ பத்திரிகை படித்தாயா?<br>నీ పత్తిరిక్కయ్ పడిత్తాయా? | நான் அவன் அம்மாவைக் கூப்பிடுவேன்.<br>నాన్ అవన్ అమ్మావై కూప్పిడువేన్. |
| Bengali | আপনি কি সংবাদপত্রটি পডেছেন?<br>ఆప్ని కి సంబాద్‌పట్రోటి పొరెచెన్? | আমি তাঁর মাকে ডাকব।<br>ఆమి టార్ మా కి డాక్బో. |
| Marathi | तुम्ही पेपर वाचला आहे का?<br>తుమ్‌హి పేపర్ వచల అహె కా? | मी त्याच्या आईला बोलावेन.<br>మి త్యచ్యా ఐలా బొలవెన్. |
| Kannada | ನೀವು ಪತ್ರಿಕೆ ಓದಿದಿರಾ?<br>నీవు పత్రికె ఓడిద్దిరా? | ನಾನು ಅವನ ತಾಯಿಯನ್ನು ಕರೆಯುತ್ತೇನೆ<br>నాను అవన తాయియన్ను కరెయుట్టేనె. |
| Odia | ଆପଣ ଖବରକାଗଜ ପଢ଼ିଥିଲେ କି?<br>అపణ ఖబరకాగజ పఢితిలె కి? | ମୁଁ ତାଙ୍କ ମାଆଙ୍କୁ କଲ୍ କରିବି।<br>మున్ తంక మాన్క్కు కల్ కరిబి |
| Gujarati | તમે છાપું વાંચ્યું હતું?<br>తమె ఛాపు వాన్చ్యు హతుం? | હું તેની માતાને બોલાવીશ<br>హు తెనీ మాటానె బొలావేష |
| Assamese | তুমি বাতৰি কাকতখন পঢ়িলানে?<br>తుమి బటోరి కాకొటఖోన్ పొర్హిలానె? | মই তাৰ মাকক মাতিম।<br>మొయి తార్ మాకొక్ మాటిమ్. |
| Malayalam | നിങ്ങൾ പത്രം വായിച്ചുവോ?<br>నింగల్ పథరమ్ వయిఛువొ? | ഞാൻ അവന്റെ അമ്മയെ വിളിക്കാം.<br>న్యాన్ అవంతె అమ్మాయె వలిక్కామ్. |
| Sanskrit | त्वया वर्तमानपत्रं पठितं वा?<br>త్వయ వర్తమాన్‌త్రమ్ పఠితమ్ వ? | अहं तस्य मातरम् आह्वयामि।<br>అహ మ్ తస్య మతరమ్ ఆవహాయమి. |

# పర్యావరణ ఇంద్రజాలికుడు



పదిహేనేళ్ల కృతి పరేఖ్ పర్యావరణానికి సంబంధించిన ప్రచారంలో కొన్ని అద్భుత పద్ధతులను ఉపయోగిస్తోంది. ప్రకృతి ప్రేమికురాలైన ఈ బాలిక పర్యావరణానికి ప్రయోజనాలను ప్రోత్సహించడానికి ఇంద్రజాలాన్ని ఉపయోగిస్తోంది. భారతదేశపు అతి చిన్న వృత్తి ఇంద్రజాలికురాలిగా కృతి చరిత్ర సృష్టించింది. గత ఐదు సంవత్సరాలుగా ఈ రికార్డును ఆమె కొనసాగిస్తోంది.

ఇతర ఇంద్రజాలికుల వలెనే, ఈమె కూడా తన జుబ్బాలో చాలా మాయలను పెట్టుకుని ఉంది. కాని ఈమె ట్రిక్కులన్నీ పర్యావరణ సందేశాన్ని మోసుకుపోతుంటాయి. ఉదహరణకు, కాగితాన్ని ఆరగించడంలో, రీసైకిల్ చేసిన కాగితాన్ని ఇంద్రజాల విద్యతో పునరుత్పత్తి చేయడంలో ఆమె చాలా నేర్పు సాధించింది. ఇది రీసైక్లింగ్ యొక్క ప్రాధాన్యతను చిత్రించే మాయ. ఒక అరటి తోలును సుందరమైన గులాబి మొక్కగా మార్చడం ఆమెకు ఎంతో ఇష్టమైన ట్రిక్. పర్యావరణాన్ని చెత్త సైతం ఎంత సుందరంగా మార్చగలుగుతుందో దీని ద్వారా ఆమె ప్రదర్శిస్తుంది.

విలియం జంబాగో సంరక్షణలో (సుప్రసిద్ధ ఇంద్రజాలికుడు పి.సి.సర్కార్ సహాధ్యాయి) కృతి దాదాపు 8 వేలకు పైగా ట్రిక్కులలో నేర్పు సాధించింది. ఇంతవరకు 1,500 పైగా ప్రదర్శనలిచ్చిన ఈమె ఇంద్రజాల వ్యాపారంలో సుదీర్ఘ అనుభవం సాధించింది.

ఈ వాణిజ్య ఊహాకర్త పర్యావరణ ప్రాజెక్టులకు సంబంధించి దాదాపు 100 ముంబై పాఠశాలలతో పొత్తు పెట్టుకుంది. ముంబై బాల భవన్‌లోని ఎకో-కిడ్ క్లబ్‌లో ఈమె క్రియాశీల సభ్యురాలు కూడా. బాలభవన్‌లో ఏర్పర్చిన పురుగుల సేద్యం (వెర్మికల్చర్) ప్రాజెక్టు వెనుక ఈమె మేధస్సు దాగి ఉంది. దీంట్లో, తోటలోని చెత్తను ఎరువుగా మార్చేందుకు వానపురుగులను ఉపయోగిస్తారు. ఈ ప్రక్రియను ఆమె తన స్వంత ఇంటిలోనూ, ముంబైలోని ఒక దేవాలయంలోనూ ఆమె ఉపయోగించింది. వెర్మికల్చర్ ప్రాజెక్ట్ చాలామందిని ఆకర్షించింది. కృతిని బిబిసి రేడియో ఇంటర్వ్యూ చేసింది. పిల్లలపై తీసిన ఒక జపనీస్ లఘుచిత్రంలో కూడా ఈమె కనిపించింది.

గత సంవత్సరం, కృతి యునైటెడ్ నేషన్స్ ఎన్విరాన్‌మెంట్ ప్రోగ్రాం (యుఎన్ఇపి) గ్లోబల్ అవార్డ్ సాధించింది. అదే సంవత్సరంలో, అమెరికా లాస్ వెగాస్‌లో జరిగిన ప్రపంచ ఇంద్రజాలికుల సభలో భారత్ తరపున కృతి ప్రాతినిధ్యం వహించింది.

CHANDAMAMA'S

# Ramayana

An Epic Journey






**Follow the epic journey of Prince Rama, from his birth to his exile, from the abduction of his wife, Sita, to his great war with the Asura King, Ravana, in Chandamama's latest offering: Ramayana - An Epic Journey.**

**Price: Rs 449/-**

**To place an order, go to www.chandamama.com**

**Chandamama's Ramayana is available only in English at all leading book shops.**

విదూషకుడు

బీర్బల్



# చక్రవర్తి స్వప్నం



1. ఒక రాత్రి, అక్బర్ చక్రవర్తి స్వప్నం నుంచి మేలుకొన్నాడు. ఆ కలలో, అతడి పళ్లు ఒకటి తప్ప మిగతా అన్నీ మాయమైపోయాయి. అక్బర్ ఆందోళన చెందాడు. దీనర్థం ఏమిటి?



2. మరుసటి రోజు, అక్బర్ ఆస్థాన జ్యోతిష్కులను పిలిపించి తన కల రహస్యం ఏదని వారిని అడిగాడు. వారిలో ఒకరు 'షహెన్‌షా , ఇది అశుభసూచకం!' అన్నాడు.



3. జ్యోతిష్కుడు కొనసాగించాడు. 'షహెన్‌షా! మీకు ప్రియమైన వారి మరణాన్ని ఇది సూచిస్తోంది.'



4. చక్రవర్తి నిర్ఘాంతపోయాడు. అరిచాడు. 'మీరంతా నాకు మనో వ్యాకులత తెచ్చి పెడుతున్నారు. పొండి అవతలకి,' జ్యోతిష్కులు అవమానపడ్డారు.



5. అక్బర్ చింతామగ్నుడయ్యాడు. ఈలోగా బీర్బల్ వచ్చి 'షహెన్‌షా మీరు విచారంలో మునిగి ఉన్నారు!' అన్నాడు. అక్బర్ తనకు వచ్చిన కల, దానిపై జ్యోతిష్కుల అంచనా గురించి చెప్పాడు.



6. బీర్బల్ చక్రవర్తిని ఓదార్చ చూశాడు. 'జ్యోతిష్కులందరూ చెప్పింది తప్పే' అన్నాడు. అందుకు అక్బర్, 'నీకు జ్యోతిష్కం తెలిసి ఉంటే నా కల అర్థం ఏమిటో శోధించి చెప్పు,' అన్నాడు.



7. బీర్బల్ 'మనిషి పెద్దవుతున్నకొద్దీ దంతాలు కిందపడిపోతాయని మీరు అంగీకరిస్తున్నారు. మీ బంధువులు ముసలివారయేంతవరకు సుదీర్ఘ జీవితం గడుపుతారని మీ కల చెబుతోంది జహాపనా.'



8. బీర్బల్ కొనసాగించాడు. 'ఒక పన్ను మాత్రమే ఉండటం అనేది మీ బంధువుల కన్నా మీరు ఎక్కువకాలం జీవిస్తారని, వారికంటే ఎక్కువ సంతుష్టిగా జీవిస్తారని తెలుపుతోంది.'



9. అక్బర్ నిట్టూర్పు విడిచాడు. మనసులో భారాన్ని తొలగించినందుకు అతడు బీర్బల్‌కు ధన్యవాదాలు చెప్పాడు. బీర్బల్‌కు బంగారు నాణేలున్న సంచి కూడా బహుమతిగా అందించాడు.

మ్యాన్ ఆఫ్ ది వార్ అనేది సముద్రాల లోతుప్రాంతంలో కనబడుతుంటుంది. కాని ఇది ప్రమాదకర మైన సముద్ర ప్రాణి. ఇవి సముద్రాల్లోని ఉష్ణ జలాల్లో ఉంటాయి. ఈ జంతువు జెల్లీ ఫిష్ అనే చేప కుటుంబానికి చెందినది. శాస్త్రజ్ఞులు దీన్ని ఒకే జంతువు కాదని అంటారు. ఇది నెగడు లేదా తంతునాగమనే నాలుగు రకాల జంతువులతో కూడిన సమూహం. ఇది సిలిండర్ తరహా దేహాన్ని కలిగి ఉంటుంది. కొండెలతో కూడిన తెరుచుకున్న నోటిభాగాన్ని ఇది కలిగి ఉంటుంది. మ్యాన్ ఆఫ్ వార్ ఒక అకశేరుకము. ఇది సముద్రంలో తేలియాడుతూ ఉండవచ్చు. ఇది నీటి ఉపరితలంపై ప్రయాణిస్తుంంది గాలిని పీల్చుకోవడానికి ఇది నిరంతరం రూపం మార్చుకుంటూ ఉంటుంది. ఇది తన పొడవాటి, నీలి, దారం వంటి స్పర్శకాలతో తన ఎరను కుడుతుంది.

ఇది కుట్టిన చోట మంట పుడుతుంది. రసగ్రంధుల నుంచి రసం బయటకు వస్తుంది. చాలా సందర్భాలలో దీనివల్ల శ్వాస తీసుకోవడం కూడా కష్టమైపోయి ఒక్కోసారి గుండె కొట్టుకోవడం ఆగిపోతుంది కూడా.

# పాలకులు

**ఈనెల మనం మన పాలకులలో కొందరితో స్క్రాప్ బుక్ తయారు చేద్దాము.**



శివాజి



టిప్పు సుల్తాన్



రంజిత్ సింగ్



జహాంగీర్



పృథ్వీరాజ్ చౌహాన్



అశోకుడు









HERCULES
MTB TURBODRIVE
RIDE YOUR PASSION

# Play to win on every street







Official bicycle partner of






HERCULES
MTB TURBODRIVE | REFLEX

Lower Step- thru Stylish Frame | Twin Tube Design Turbodrive | Comfy Saddle | Aero Soft Grips | Frame Height :19" | Avalable Wheel Sizes:26"

YouTube bsahercules | www.bsahercules.com
Customer care no : 18001022324 (Toll Free)

